## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010006481

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

## Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books
Newspapers
Palm Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీః.

# నీతిరత్నాకరము

ఇయ్యది,

కళాప్రపూర్ణ కావ్యస్మృతి తీర్థ

జనమంచి శేషాద్రిశర్మచే

రచియింపఁబడినది.



APPROVED BY THE TEXT-BOOK COMMITTEE FOR CLASS USE

*(Vide Page 258, Fort St. George Gazette Part 1 B, 2-5-1939)*

చెన్నపురి:

'వావిళ్ల' ప్రెస్సున

ముద్రింపఁబడినది.

1939



మూల్యము 0—8—0.

# తొలిపలుకు.

---

సరసమనీషులారా! నీతిరత్నాకరమను నీయాఖ్యాయికను దమ కర్పింపఁగలిగితిని ఇందు నీతిమార్గావలంబకులకు విజయము, తద్విరుద్ధమార్గావలంబకులకు నపజయము గలుగుటయే ప్రధానభాగము. ఈవిషయములు రెండు నిందు విస్పష్టములగు. విశేషించి భగవత్సహాయము, సాధువుల తోడ్పాటు నీతిమార్గమునకుఁ గలదని యీయాఖ్యాయిక తెలుపును. స్త్రీపురుషు లన్యోన్యసుగుణప్రేరితులై ప్రేమగలవారలైననే యది చిరకాలము నిలుచు ననియు, వేఱొకమార్గమున నది యచిరకాలముననే క్షీణించు ననియుఁ దెలుపుటకే యీచిన్నిపాత్రము వ్రాయఁబడిన దనియుఁ దెలుపుదును. జనుల యభిప్రాయము లెట్టులున్నను నీతిమార్గము సర్వపక్షసమాదరణీయమగును గదా. దాని నాశ్రయింపఁబూనిన మార్గములు వేలువేలుగా నుండును. ఏమార్గము తుదకు నీతిమార్గమునఁ దన్నాశ్రయించినవానిం జేర్చునో యదియే సన్మార్గ మనఁబడును అట్టిమార్గములఁ దెలుపు గ్రంథములే పాఠకులకు నుపకరించునవి

ఇందు నాచేసిన కృషి విశేషించి వ్రాయఁదగినది కాదు. స్త్రీవిద్య యెట్టిది మంచి దను నది నాయెఱింగినంతవఱకు నిందుఁ దెలిపితిని దుష్టమంత్రములు లోనగు నవి తొలుదొలుత మేలు గలిగించిన ట్లగపడినను తుదకు హానిఁ గల్గించునని యీ కథా

రూపమున విశదీకరించితిని. మహాకాళి బలివలన సంతృప్తినొంది భక్తులకు వరములొసంగు నన్న ప్రవాదము సత్యేతర మనియు నశాస్త్ర మనియు స్పష్టపఱచితిని. విశేషించి దేవతోత్సవములందుఁ జేరు జనులు భక్తిభావముగలవారు కొలఁది సంఖ్యాకులేయని తేటపఱచితిని. మూలికలయం దద్భుతశక్తి కలదని తెలియఁబలికితిని. ఇట్టి విషయములు బాలురహృదయముల నిలుపవలయు ననియు, దాన సనాతననీతిమార్గము పెంపొందుననియు, విశేషించి దేశభక్తియుఁ బ్రభుభక్తియుఁ గుదురుకొన నవకాశము కలుగుననియు నాయాశయము. తక్కినవిషయములు గ్రంథపఠనముననే తెలియఁగలవు. ఇక్కడ వ్రాయ నవసరము లేదు.

ఈపొత్తమును ముద్రింపఁ గోరఁగనే యంగీకరించి మూఁడుదినములలో ముద్రించియిచ్చిన యాంధ్రగ్రంథోద్ధారకులు మ. రా. శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి కీమూలమున నాకృతజ్ఞతం దెలుపుచున్నాఁడను. కథాసంవిధానమున నెన్నియో లోపములుండును వానినెల్ల నాచే సంస్కరింపఁజేయ భాషాభిమానుల నంజలిఘటించి వేఁడుచున్నాఁడను. ఇంకఁ బెంచి వ్రాయ నుద్యమింపక సజ్జనులను దీనికిఁ జేయూఁత యొసంగ వేఁడుచు విరమించుచున్నాఁడను.

ఇట్లు సుజనసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీః

# నీతిరత్నాకరము

---

## ఇష్టదేవతాప్రార్థనము.

చ. సిరి యని గౌరి యంచు సర◆సీరుహసంభవురాణి యంచు ని
ర్జరులు మునీంద్రు లెల్లపుడు ◆ సన్నుతి చేయుచుఁ గొల్వ దివ్యతుల్
నిరతము పాదపద్మముల ◆ నెమ్మి శిరంబులఁ దాల్ప నాద్యయై
పరశివయుక్తి భక్తజన◆పాలిని నాఁ దగు దేవిఁ గొల్చెదన్. ౧

ఉ. తెలియనివారి కెప్పగిదిఁ ◆ దేటగ నీతులఁ దెల్పవచ్చు న
ప్పలుకుల దెల్పుచున్న నగుఁ◆బాటగుఁ గానఁ గథావిధానమే
సులలితమార్గ మప్పనికిఁ ◆ జొప్పడియుండునటంచు నెంచి నేఁ
దెలిపెదఁ దద్విధంబుగ సుధీవరసమ్మత మౌ తెఱంగునన్. ౨

---

## మొదటి వీచిక.

ఆరోగ్యభాగ్యముల నిచ్చుపదార్థములయందెల్ల నదు లగ్రస్థానము నాక్రమింపఁ దగినవి. పూర్వులు వానిని బరమపావనములని, సేవింపఁదగినవని, సకలపాపముల నడంచునని తెలిపియున్నవారు. జలములు భూమిని బవిత్రముగాఁ జేయునని,

ఆభూమి మానవులను బవిత్రులనుగా నొనరించునని వేదములు తెలుపుచున్నవి. సకలకల్మషముల నదులు హరించుననుట నిక్కము. కల్మషమనఁగా దేహమాలిన్యమని కొంద అర్థము చెప్పుదురు. ప్రవాహోదకములయం దుదయకాలమునను ముంచి స్నానముచేసిన సకలరోగములు నశించునని యాయుర్వేదము తెలుపుచున్నది. దీనినెల్ల నంగీకరించియే యున్నారు. పదార్థవిజ్ఞానశాస్త్రవేత్తలు లక్ష్యలక్షణపురస్సరముగా దీనిని దృఢపఱచుచున్నారు. ఆరోగ్యముకలిగినపుడు మనస్సు పరిశుద్ధముగ నుండుననియు, నది మంచికార్యములు చేయఁబూనుననియు నార్యులభావము. కావున నదులు పాపములు తొలఁగించుననుట యుక్తియుక్తమే యనవచ్చును.

నదులు సమీపముననున్న దేశములు ధనసంపన్నములుగ నుండుట సాధారణము. ఆదేశములకు నదీమాతృకములని పేరు. తల్లివలె నదులు పయఃప్రదానమున నెల్లభంగులఁ బోషించుటం జేసి నదీమాతృకములను పే రాదేశములకుఁ గలిగెనని పెద్దలందురు. ఆయర్థము యుక్తి కనుకూలముగనే యున్నది. సస్యములకు ఆరోగ్యమునకు నదులు మహోపకారకము లనుసిద్ధాంతము సర్వజనాంగీకారమును బడసినది. నదుల యిరుదరులకుఁ బరిసరమున నున్న భూములు సారవంతములయి యుండుట సర్వజనవిదితమగు విషయముగాని మాఱుమూలనుండునది కాదు. ఏయేభాగములనుండియో యొండుమట్టిని దెచ్చి భూములం గప్పును. సస్యములు సమృద్ధిగ దానిచే ఫలించును. కర్షకుల కింతకంటె మహోపకారము చేయుంటెట్లు?

ఏఁబదియాఱుదేశములుగా నీ భరతఖండము విభజింపఁబడి యుండెడిది. ఏఁబదియాఱు భాషలుండెనని కొంద ఱందురు. అన్నియుండవనియు సంస్కృతము ప్రాకృతాది షడ్భాషలు, వీనివికారములుగా భాష లుండెనని కొంద ఱందురు. ఇప్పటిభాషలంబట్టి యాకాలపుభాషల నిర్ణయించు టంత మంచిదిగాదు. ఆదేశములయందు మహారాష్ట్రదేశము మిగులఁ బ్రఖ్యాతిని మించియుండెను. మహారాష్ట్రదేశీయులు మిగుల బలాఢ్యులు. సదాచారపరాయణులు. ప్రతిక్షణ విలక్షణపరిణామములగు నాచారములనవలంబించు నూహలు గలవారు కారు. పూర్వులయందు గౌరవము, దేశమందు విశ్వాసము, శాస్త్రములయందుఁ బ్రీతి, భగవంతునియందు భక్తి యను నివి వారికిఁ దోడఁబుట్టినగుణములు. స్వదేశాభిమానము మెండు బలపరాక్రమములయం దాఱితేఱినవార లయ్యు నొరుల హింసించునలవాటుగలవారు కారు. ఊర కూరక త మ్మలయించినపుడు మాత్రము ప్రతిఘటింతురు. ప్రతిఘటించిరిపో కార్యము పండుటయో మేనుఁ దొలఁగుటయో కావలసినదే కాని నడుమ వదలుకొను నాచార మాదేశీయులకు లేదు. వారికి జీడిమచ్చులని పేరుగల్గుటకుఁ గారణమిదియే యయి యుండనోపు. సామాన్యముగా నెల్లరు భవానిని బూజించువా రనవచ్చును. ఆ మెకరుణ లేక వృద్ధికాఁజాలమను విశ్వాసము వారలకు నుగ్గుతోఁ బెట్టినట్టిది. కావుననే శ్రద్ధాభక్తుల భవాని నారాధింతురు బలుల నర్పింతురు. గవ్వలతో నాదేవిని బూజించువారు కొందఱు గలరు. నిర్మలమగు వస్తువుల నర్పించిన నిర్మలముగా బుద్ధియుండునని వారియూహ కాఁబోలు.

వారలను గవ్వలుకూర్చిన హారముండును. అది కుంకుమపంకలిప్త ముగనుండును.

అట్టి మహారాష్ట్రదేశమున నొక పుణ్యనదీపరిసరమున విలాసధామ మనునగరము గలదు. నదీతటమున నదికట్టఁబడు టచేఁ బ్రవాహసమయమున బాధకలిగినను దక్కఁగలకాలములయందు సుఖసమృద్ధికిఁ గొదువ లేకుండెను. కావున నా గరము సుఖధామ మను ప్రఖ్యాతిని గాంచెను. నగర మతి విశాలభూభాగము నాక్రమించి యుండెను. గృహములు క్రిక్కిఱిసియుండక యెడముగలిగి ప్రాకారవేష్టితములై యుండెను. కావున నారోగ్యభాగ్యమునకుఁ గొదున లేదనవచ్చును. గృహచతుర్భాగములఁ గ్రిక్కిఱిసి వృక్షము లుండవలయునని రాజశాసనము. కావున శీతలచ్ఛాయాద్రుమములు విశేషించి యుండెను. ఎండవేఁడిమి విశేషించి సోఁకకయుండ నాద్రుమములు కాపాడుచుండఁగా నిఁక వాసయోగ్యము కాదనుట యెట్లు? పురము నలుప్రక్కలనుండు భూభాగము తగ్గుగా నుండెను. నగరము గలభూభాగ మున్నతము. కావున మురికి నీరు నిలువక పోవుచుండఁగా నెంతయో యారోగ్యముగా నుండెను.

సౌధపంక్తులు చక్కఁగాఁ దీర్చికట్టిన ట్లుండెను. వీథులు విశాలములు. రెండుప్రక్కలను జాలుగ ఛాయాద్రుమములు గలవు. వానిమూలముల నరుఁగులు వేయఁబడియుండెను. బాటసారు లందుఁ గూరుచుండి యలసట తీర్చుకొనుచుందురు. క్రొత్తవా రానగరమును జూడవత్తురు. ఆనందయాత్రయని దానిపేరు. ఆపేరు మిగులఁ బ్రఖ్యాతి వహించెను. ఏటేట వేసవి

కాయాత్ర దూరదేశాగతజనులచే సాగింపఁబడును. ఆనగరమును జూచి యందుఁ బదిదినములుండి యా శీతలమారుతమును సేవించి కృతకృత్యులై మరలి పోవుచుందురు కన్నులు భగవంతుఁడొసంగినందులకు ఫల మానగరమును జూచుటయే యని యెల్లవా రనుచుందురు. యాత్రార్థులకుఁ గొన్ని యిండ్లు నిర్మింపఁబడి యుండును గృహాభృతి యించుకంత యేగాని వృద్ధి చేయరాదని రాజశాసనము కలదు. కావున బాటసారుల కేమాత్రము కష్టము కలుగ నవకాశము లేదు. కావుననే యానందయాత్ర యను పేరు సార్థకమయ్యెను.

ఆ దేశమేలుభూజాని కరుణాకరుఁ డని ధర్మాత్ముఁ డని విఖ్యాతినొందెను. ఆవిఖ్యాతికిఁ గారణము న్యాయపరిపాలనమే గాని వేఱొకటి కాదు. ప్రజలు రాజును భగవంతునిగా భావించుచుండిరి. కావుననే యా రాజ్యము శాంతికి సంస్థానమయి యుండెను. అపరాధములకు శాసనములు గలవుగాని వాని నుపయోగించు నవసరము లేకుండెను. న్యాయాధికారులని, కారాగృహాధికారులని కొందఱుండిరి. కాని వారికి నెప్పుడో యొకప్పుడు తప్పఁ దక్కినపుడు కాలముపుచ్చు నుపాయము లేక పురాణములఁ జదువుకొనుచుండిరి. ఆ విలాసధామమున వీధికొక్క పుస్తకభాండాగారము నెలకొల్పఁబడి యుండెను సకలగ్రంథము లందు దొరకుటంబట్టి యవకాశము దొరకినపుడెల్ల జను లచటికిం బోయి చదువుచుండిరి అందందు నాటకశాలలు గలవు. అవి పౌరజన సంతృప్తి నొసఁగించుటకొఱకె నేర్పఱుపఁబడినవే. ఇట్టివెన్నియో జనోపకారములుగ నిర్మింపఁబడినందుననే యానగరము వాసయోగ్య మయ్యెను.

ఆనగరమున నొక ధనవంతుఁ డుండెను. ఆతనిపేరు శ్రీనివాసదాసు. తలిదండ్రు లాతనికి వివాహమువఱకుఁ గలసంస్కారము లొనరించి గతించిరి. భార్యంగూడి శ్రీనివాసదాసు సద్వృత్తిఁ గాలముఁ బుచ్చుచుండెను. లక్ష్మీనారాయణులవలె వార లున్నవారని యెల్లవారు వాడుచుండిరి. పరోపకారము వారికి నైజగుణము. కాని ముఖస్తుతులను జేయువారిని మాత్ర మాదా పాదరింపకుండెను దీనాంధబధిరాదు లాతనియిల్లు కల్పవృక్షమని కాచుకొని యుందురు. అన్నదానము వస్త్రదానము ననునీరెంట నాతఁ డెక్కుడుగాఁ జేయువాఁడు. తక్కినదానములు యథోచితముగాఁ జేయుచుండును. బంధువులరాకనుఁ బరిమితిలేకుండెను. వ్యాపారమున ధనమెక్కువగా లభించుచుండుటనే వ్యయము నాతనిమదికి లెక్కింపఁదగినది కాకయుండెను. ఆవ్యాపారము న్యాయము నతిక్రమింపక చేయఁబడుచున్నందున దినదినాభివృద్ధి నొందుచుండెను.

ధర్మంబు చెఱుపఁ జెఱచును,
ధర్మము రక్షించువారిఁ • దా రక్షించున్.

అన్నసూక్తి యేల తప్పును? ఆవ్యాపార మాతనికాలమున నారంభింపఁబడినది కాదు. కులవృత్తి. కావున శాస్త్రీయమే యనవలయుఁగదా.

శ్లో. "స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః."

అను భగవద్గీతావాక్యము ప్రమాణము కదా. ఆవ్యాపారమునే పాటించి కులవృత్తియని భగవత్ప్రతిపాదితమని కర్తవ్యమ్మని యాతఁ డొనరించుచు దేహమంతయుఁ గన్నులుగా

సంచరించు చుండెను. కులవృత్తి భగవద్దూ హమనుగాఁ దలంచుచు దాని ననుసరించినఁ గృతార్థునింజేయు నని పెద్ద లందురు.

శ్రీనివాసదాసునకు నాలుగుసంవత్సరముల దనుక సంతానము లేకుండెను. కళత్రము మనసున నించుకవిచార మూనుచుండెను. పతికి నెదురాడనోడునట్టి శీలముకలది. కావున బయలుపడనీయక యుండెను. ఎట్టులో యాఖేద మును భర్త యెఱింగెను. సత్కళత్రము చింతదీర్చుట పతికి హితముగదా యని సన్మతి నాలోచించి యిట్లు తలపోయఁ జొచ్చెను. మానుషానంద మెల్లరకుఁ గావలసినదియే. దానిం గాంక్షించుట పొరపాటు గాదు. ధర్మప్రజాభివృద్ధ్యర్థము కదా వివాహము చేసికొనుట. దీనికిఁ బురాకృతపుణ్యము తోడు పడవలయు దానికి మానవప్రయత్నము కూడఁ గావల యును. దైవపరులు కొందఱు మానవప్రయత్న మేలయం దురు. అది పాటింపఁదగినమాట యనవలయును. భగవంతుని సేవించుట ప్రధానము. దాన నిహాపరములు గలవు. దాని మాన నీరెండును జెడును. కాఁబట్టి యీశ్వరు నారాధించు టుచితము. ఆ యారాధనము కూడఁ దొలుదొలుత విశ్వాస మును బుట్టించునదిగ నుండవలయుఁ గదా. లేనిచో స్త్రీలకు భక్తి కుదురదు. ధర్మార్థకామమోక్షములను పురుషార్థములు నాలుగు వాంఛింపఁదగినవే యని పురాణములు తెలుపుచున్నవి. కనుక నిపుడు శ్రీకృష్ణు నారాధించుట యెంతయుఁ దగియుం డెను. అందును సంతానగోపాలనామమున శ్రీకృష్ణు నారాధిం చుట సముచితమగు. ఈనామమును విన్నయంతనే నాకళత్రము

ఆనగరమున నొక ధనవంతుఁ డుండెను. ఆతని పేరు శ్రీనివాసదాసు. తలిదండ్రు లాతనికి వివాహమువఱకుఁ గలసంస్కారము లొనరించి గతించిరి. భార్యంగూడి శ్రీనివాసదాసు సద్వృత్తిఁ గాలముఁ బుచ్చుచుండెను. లక్ష్మీనారాయణులవలె వార లున్న వారని యెల్లవారు వాడుచుండిరి. పరోపకారము వారికి నైజగుణము. కాని ముఖస్తుతులను జేయువారిని మాత్ర మాదాపాదరింపకుండెను దీనాంధబధిరాదు లాతనియిల్లు కల్పవృక్షమని కాచుకొని యుందురు. అన్నదానము వస్త్రదానము ననుసరించుటనాతఁ డెక్కుడుగాఁ జేయువాఁడు. తక్కినదానములు యథోచితముగాఁ జేయుచుండును. బంధువులరాకకుఁ బరిమితిలేకుండెను. వ్యాపారమున ధనమెక్కువగా లభించుచుండుటనే వ్యయము నాతనిమదికి లెక్కింపఁదగినది కాకయుండెను. ఆవ్యాపారము న్యాయము నతిక్రమింపక చేయఁబడుచున్నందున దినదినాభివృద్ధి నొందుచుండెను.

ధర్మంబు చెఱుపఁ జెఱచును,
ధర్మము రక్షించువారిఁ దా రక్షించున్.

అన్నసూక్తి యేల తప్పును? ఆవ్యాపార మాతనికాలమున నారంభింపఁబడినది కాదు. కులవృత్తి. కావున శాస్త్రీయమే యనవలయుఁగదా.

శ్లో. "స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః."

అను భగవద్గీతావాక్యము ప్రమాణము కదా. ఆవ్యాపారమునే పాటించి కులవృత్తియని భగవత్ప్రతిపాదితమని కర్తవ్యమని యాతఁ డొనరించుచు దేహమంతయుఁ గన్నులుగా

సంచరించుచుండెను. కులవృత్తి భగవద్రూపముగాఁ దలంచుచు దాని ననుసరించినఁ గృతార్థునిం జేయు నని పెద్ద లందురు.

శ్రీనివాసదాసునకు నాలుగుసంవత్సరముల దనుక సంతానము లేకుండెను. కళత్రము మనసున నించుకవిచార మూనుచుండెను. పతికి నెదురాడనోడునట్టి శీలముకలది. కావున బయలుపడనీయక యుండెను. ఎట్టులో యాఖేదమును భర్త యెఱింగెను. సత్కళత్రము చింతదీర్చుట పతికి హితముగదా యని సన్మతి నాలోచించి యిట్లు తలపోయఁ జొచ్చెను. మానుషానంద మెల్లరకుఁ గావలసినదియే. దానిం గాంక్షించుట పొరపాటు గాదు. ధర్మప్రజావృద్ధ్యర్థము కదా వివాహము చేసికొనుట. దీనికిఁ బురాకృతపుణ్యము తోడు పడవలయు దానికి మానవప్రయత్నము కూడఁ గావలయును. దైవపరులు కొందఱు మానవప్రయత్న మేలయందురు. అది పాటింపఁదగినమాట యనవలయును. భగవంతుని సేవించుట ప్రధానము. దాన నిహపరములు గలవు. దాని మాన నీరెండును జెడును. కాఁబట్టి యీశ్వరు నారాధించు టుచితము. ఆ యారాధనము కూడఁ దొలుదొలుత విశ్వాసమును బుట్టించునదిగ నుండవలయుఁ గదా. లేనిచో స్త్రీలకు భక్తి కుదురదు. ధర్మార్థకామమోక్షములను పురుషార్థములు నాలుగు వాంఛింపఁదగినవే యని పురాణములు తెలుపుచున్నవి. కనుక నిప్పుడు శ్రీకృష్ణు నారాధించుట యెంతయుఁ దగియుండెను. అందును సంతానగోపాలనామమున శ్రీకృష్ణు నారాధించుట సమంచితమగు. ఈనామమును విన్నయంతనే నాకళత్రము

భక్తిప్రీతులు గలదగును. అవిరెండును గుదిరినఁగాని యారా ధనము సఫలము కాదు. అని యాలోచించి యది లెస్సగా మదికి సరిపడినందున నవకాశము కలిగింపక మున్నె తన్నెఱిం గిన వృద్ధభూసురవరేణ్యుని బిలువంబంచి యుచితసపర్యల జరపి యుదంత మెఱింగించెను. మహానీయుఁడా ప్రశ్న మున కానందించి నీవాంఛితము ఫలించును. సత్యము. శ్రీఘ్రంబ సంతానగోపాలమూర్తిని బూజింపుము. ఆపద్ధతి నాల కింపుము.

శుభముహూర్తమున విత్తశాఠ్య మొనరింపక రత్న సువర్ణరజతాదులచే శ్రీకృష్ణునాకృతిని స్థండిలమున నునుపవల యును. సకలవిధాలంకృతమండపము నమరించి తన్మధ్య కల్పిత స్థండిలమున నునిచిన శ్రీసంతానగోపాలమూర్తిని బూజింప వలయును. ఆనాఁడు ప్రతియామమునను బూజ చేయవల యును. గోభూప్రభృతిదానములను యథాశక్తి నొసరింపవల యును. సాధువ్రతపరాయణులగు విప్రప్రవరులకు భోజనం బిడవలయు. దీనాంధకబధిరకుబ్జుల నన్నదానమున సంతృప్తులఁ జేయవలయు. ఆవలఁ దాను సభార్యుఁడై భుజించి యా ప్రతిమను శుద్ధశ్రోత్రియునకు దానము చేయవలయును. ఈభగవత్పూజ భక్తితోఁ జేయవలయును. దంభాచారున కది ఫలము నీయదు. మనోవాక్కుల నేకరీతిగా భావమల రారఁ బూజించిననే ఫలముగలుగును. ఈపూజ సాంగముగా నెఱవేఱిన సంతానము కలుగును. రాధామాధవులయం దెవ్వ రిపై నధికభక్తి కలుగునో తదంశము గలసంతానము గలు గును. ఇది సత్యము. అని వ్రతవిధానమును దెలుప శ్రీని

వాసదాసు సంతోషించెను. ఆయనధర్మపత్ని యిందిరాదేవి పరమానందభరితురా లయ్యెను. వృద్ధవిప్రప్రవరుఁడు తన యింటికిం బోయెను.

తరువాత నాదంపతు లాలోచించుకొని సుముహూర్తము నిశ్చయింపఁబడఁగా వ్రతమునకుఁ గడంగిరి. సద్బ్రాహ్మణుల రావించిరి. విత్తశాఠ్యము లేక ప్రతిమను జేయించిరి. యథోక్తముగా వ్రతము నాచరించిరి. ఇంచుకయేనియ్యుఁ గొఱంతగాంచక యావ్రతము పూర్తిచేయఁబడియెను. ఎల్లరా వ్రతమును దిలకించి తప్పక సంతానముకలుగునని విశ్వసించిరి. వారి భక్తిశ్రద్ధలు చూచువారికెంతయు నచ్చెరువు గలుగఁజేసెను. ఇంచుకంతయు లోప మేవిషయమునందును గలుగక యుండెను. కొలఁదిదినములు జరగ నాయిందిరాదేవి గర్భవతియన్న సువార్త మెల్లమెల్లన నలుదెసలకుం బ్రాఁకెను. దాని విన్నవారెల్ల నానందాంభోరాశి నోలలాడిరి. గర్భసంస్కారములగు పుంసవనాదులు చేయఁబడియె. నెలలునిండెను. ఒక్కనాఁ డాయిందిరాదేవి కలగాంచెను. అందొక్క సువాసిని సకలాభరణములఁ దాల్చి తాంబూలచర్వణము చేయుచు వచ్చి యొక్క చక్కనిఫల మిందిరాహస్తమున నిడి దీని ననుభవింపుమని పలికి యదృశ్యురా లయ్యెను. ఆవల మేల్కాంచి సమీపతల్పమున శయనించియున్న ప్రాణనాథునిఁ బిలిచెను. అయ్యది నాలవజాము కావున నాతఁ డనుస్మృతిని బారాయణము చేయుచుండెను. భార్య పిలువఁగనే చెంతకుం బోయి కూరుచుండి యేల పిలిచితివని యడిగెను. ఇందిర స్వప్న

వృత్తాంతమును దెలిపెను. ఇరువురు తలపోసికొని కుమారిక కలుగునని యూహించిరి.

మఱుదినము శుక్రవారము. ఆనాఁడు రెండవజాము రాఁగానే ప్రసవచిహ్నములు కనఁబడుటయు నాలస్యము లేక ప్రసవించుటయు శిశువు కన్యకయగుటయుఁ దెలియవచ్చెను. దాసు తమరూహించినట్లే సాగెనని యానందించెను. దైవజ్ఞులు గ్రహగతులఁ బరికించి బాలారిష్టాదిదోషలేశములు లేక దీర్ఘాయువుకలదని ప్రశంసించిరి. జాతకర్మాదికృత్యములు యథావిధి నొనరింపఁ బడియెను. నామకరణమహోత్సవకాలమున యథోచితసత్కారముల నెల్లరం దనిపి రాధికయనుపేరు ప్రకటించి దాసు కృతకృత్యుఁ డయ్యెను బాలయు దినదినప్రవర్ధమానయై శశికలను దిరస్కరించుచుండెను. రాధిక పుట్టినది మొదలు దంపతులకు సంపల్లాభము మెండయ్యెను. దాన నాకన్యకారత్న మదృష్టవంతురాలని యెల్ల రనుకొను నట్లే వారు నూహింపసాగిరి. క్రమముగా నామెజీవితమున నెనిమిది యేండ్లు గడచెను. ఆవయస్సునకే విద్యావతియన్న పేరు వచ్చెను. ఒక్కపర్యాయము చెప్పినపాఠము మరల మఱపునకు రాకుండెను. విద్యాభ్యాసమున నాలుగువత్సరములు గడచెను. పదుమూఁడవయేఁడు రాఁగా సంగీతము చెప్ప నారంభించిరి. కంఠస్వర మనుపమానము. వర్ణనము లేలకాని కిన్నరీకంఠమును బోలియుండెననుట యథార్థము. విపంచీ నినాదము నామెకంఠము కలిసిపోవుచు వేఱుపఱుప నశక్యముగ నుండెను. ముఖచిహ్నలేశములఁ బరికించి పాడుచున్న దనవలయునే కాని దూరమున నున్న యెడల వీణావాద

నమే యనఁదగును గాని, వేటోకనాదము దానిం గలిసియున్న దన వలనుపడక యుండెను. సంగీతముతోడఁ జిత్రలేఖన మారంభింపఁబడియెను. చిత్రలేఖనమున మానవులపరీక్ష యంత మంచిదికాదని బుద్ధిమంతు లూహింతురు. పశుపక్ష్యాదులు దానింగాంచి యాసక్తములై చెంతకుంబోవ నదియే దానికౌశల మని పెద్దలందురు.

ఒక్కనాఁ డాదంపతులు వేడుకకై ద్రాక్షాఫలముల నిర్మింపుమని రాధికకుం దెలిపిరి. అట్లే యొనరింతు నని వర్ణకములఁగలిపి యామె యాఫలముల నలవరించెను. వాని నాదంపతులు చూడక రాధికా! అవి బాగుండు నని యెట్లు కనుఁ గొనవచ్చు నని ప్రశ్నించిరి. పందిరికి వ్రేలాడఁగట్టిన వానియందము ప్రకటమగు నని యామె పలికెను. గృహామునకు దూరముగనుండు నొకపందిరికి వాని వ్రేలాడఁగట్టిరి. దూరమున నుండి పరీక్షించుచుండిరి. కొలఁది నిమేషములకుఁ బక్షులు వచ్చి వానిం బొడువ నారంభించెను. చిలుకలు తటాలున నాచెంత వ్రాలెను. పటపటమని పొడువసాగెను. పరీక్షకులు చిత్రంపడిరి. తండ్రి రాధికను జెంతకుఁ దీసికొని యుపలాలించెను. వేటోకనాఁ డారాధిక యొకచిలుకను బావురమును జేవ్రాసి వర్ణకముల వాని సింగారించెను. దూరముగ నిలిపెను. చిలుకలు మొత్తముగా వచ్చి దానిం బొడుచుచుఁ బోవసాగెను. ఎక్కడనుండియో యొక శ్యేనము బుస్సున వచ్చి పావురమును దన్నెను. దానిం గాంచినవారెల్ల నిది ప్రకృతిచిత్రకమే యని పలికిరి. ఇట్లే యామె పెక్కుతడవలు

చిత్రించుచు వానిం బరీక్షించుచు దానియందు మిట్లుండినఁ గాని ఫలింప దని యూహించుచుండెను.

సంగీత మామె పాడఁగా విన్నవారెల్ల నొక్కదినము చక్క నాలోచించి సభచేసి యామె కాశీఃపురస్సరముగా నొకపదకమీయ నిశ్చయించిరి. ఆయుదంతము తల్లిదండ్రులకు ముందుగాఁ దెలిపి వారి యనుమతినొంది పెద్దల కెల్లరకుఁ దెలిపిరి. ఆనాఁ డొకచోటఁ బేరోలగము గూడెను. సంగీత శాస్త్రపారంగతులే యందుఁ బెక్కం డ్రుండిరి. తల్లిదండ్రు లారాధికను ఘోటకశకటమునఁ గొనివచ్చి యర్థాస్థానమునఁ గూరుచుండఁ జేసిరి. పురపురంధ్రులెల్ల నొకచోఁ గూరుచుండి వేడుక చూచుచుండిరి. వారి కించుక దూరమునఁ బురుషులు కూరుచుండ వారియంతికమున నొకవ్యాళగ్రాహి యుండెను. వాఁ డేల యీ విద్వత్సభలో నున్నవాఁ డని కొందఱు సంశ యించుచుండిరి. కొందఱు వాఁడు సంగీతమున నిధి యనిరి. కొందఱు చూడవచ్చె ననిరి. మఱియుఁ గొందఱు వాఁ డేదో పనియుండి వచ్చియుండుననిరి. ఇంకను గొందఱు మహాసభకు ధనవంతు లెందఱో యరుదెంతురు గాన వారిని యాచింప వచ్చె ననిరి. ఇఁకఁ గొందఱు వాఁడుకూడఁ బరీక్షకుఁడే యనిరి. మఱికొందఱు దృష్టిదోషము తగులకయుండ రక్షఁగట్టఁ బిలి పించియుందు రని యూహించిరి. ఒక్కఁడు మాత్రము కాదు కాదు. మీయూహాలు పరిహాసమునకుఁ దగినవి. ఆకన్యకను భయపెట్టి యామెకు శక్తి యెంత గలదో కనఁబఱుపవలయు నని వచ్చె నని చెప్పెను. ఇట్లు నానాముఖముల వారియూహాలు ప్రాఁకుచుండెను.

నియతకాలమున కాసభాధిపతి లేచి యానాఁటిసభా సమావేశహేతువును వివరించి రాధికకుం గల సంగీతకౌశలమును బరీక్షించుసమయ మిదియే యనియు, నోపికమైఁ జూడవలయు ననియుఁ, గోలాహల మొనర్ప నిది సమయము కాదనియు విన్నవించెను. ఆయుత్తరక్షణమున నిస్తరంగమహాసాగరము భంగి నాసభాభవనమెల్ల నిశ్శబ్దమయ్యెను. పరీక్షకు లంతకుముందే నిర్ణయింపఁబడియున్నను దత్కాలమున వారి పేరులు సభాధిపతి చెప్పుటయు నెల్లరు నామోదించుటయు జరగవలసిన యాచార మగుట నట్లే యొనర్పఁబడియెను. వారు మూవురు లేచి యాచోటున నమరుపఁబడిన యుత్తుంగాసనములపయిం గూరుచుండిరి. రాధికయు వారిచెంతనున్న యాస్తరణమున నుపవిష్టురా లయ్యెను. ఎల్లర కామె కనఁబడుచుండవలయు నని యట్లొనర్పఁబడియె నఁట. పరీక్షకులు మూవురును వ్యాళగ్రాహిని జేరిరి. ఆతఁడును రాధికసమీపమునఁ గూరుచుండెను. ఏటికో యని యెల్లరు సంశయసమాక్రాంతస్వాంతులే యైరి. కాని 'యిదమిత్థ' మ్మని యొక్కరును నిర్ణయింపఁజాల కుండిరి

పరీక్షకులలో నొక్కఁడు శివశంకరశాస్త్రి, మఱొక్కఁడు రామచంద్రరాజు, మూఁడవవాఁడు సుదర్శనప్రసాద పాండ్య, అని యెల్లరెఱుంగవలయును. శివశంకరశాస్త్రి రాధికం గాంచి "అమ్మాయీ! శంకరాభరణరాగము విపంచికయందు మేళవించి పాడుమా" యని యనురాగ మతిశయిల్లఁ బలికెను. రాధికయు విపంచికస వ్యాంకసీమఁ గుదురు పఱచి తంత్రులమీటెను. ఆస్వరము సర్వజనశ్రుతిపుటపేయ

మయ్యెను. రామచంద్రరాజు "కుమారీ! నీయెదుటనున్న వాఁడహితుండినుఁడు సుమీ! వానిచెంతనున్న పేటికయందు నవీనకాలభుజంగరాజమున్నది. శంకరాభరణ మాలాపించి పాడు నప్పుడది మనకు వశ్యమయి యెవరు చెంతకువచ్చినను క్రోధ మూనక నీపాటనే యాలకింపవలయు. అది పరీక్ష కావునఁ జక్కఁగా నీభావమును మదినిలిపి శాస్త్రము మీఱక పాడవల యును." అన, సుదర్శనప్రసాదపాండ్యమాత్ర మిది విషమపరీ క్షయే యని యూరకుండెను.

శ్రుతి సాయపడఁగా నారాధిక పాడనారంభించెను. వాద్యగళస్వనము లేకమై వీనుల విందుగ నెసంగెను. ఒక్క రైనను మాటలాడఁజాల కూరకుండిరి. ఇన్ని చిత్రప్రతిమ లొక్కచో నెట్లు చేరినవి? అను ననుమానము నది పుట్టించెను. శివశంకరశాస్త్రి వ్యాళగ్రాహిని గాంచి జాగ్రత్తపడు మనియె. ఆతఁ డించుక పేటికం గదలించెను. భయంకరముగ బుస్సను ధ్వని యెల్లరఁ దల్లడిల్లఁజేసెను. ఇది యేటిపరీక్ష? అని యంద ఱనసాగిరి. శాస్త్రి లేచి యార్యులారా! మీరూరకుండుఁడు రాధిక మాకుఁ బ్రియపుత్త్రికవంటిది. ఏమి కీడు రాఁబోదు. ఎవ్వరి కేమి కీడును గలుగదని నమ్ముఁడు. త్వరపడక యించుక యోపికం దెచ్చుకొని పరికింపుఁ డనియె. ఆమాటల కెల్లరు లోఁబడి యూరకుండిరి. రాధిక రాగ మాలాపించెను. కొలఁది నిమేషముల కాభుజంగశబ్దము సన్నగిల్లెను. మఱి కొలఁది క్షణముల కాపెట్టె మూఁతతీయ ననుజ్ఞకాఁగా నాతఁ డట్లు లొనరించెను. ఫణియు విస్తృతఫణము వెలయించి లేచెను. నేత్రము లగ్నిగోళముల నధఃకరించుచుండెను. మనోధైర్యము

మటుమాయము కాఁగా నెల్లరు చేతులు పిసికికొనసాగిరి. రాధిక మాత్రమా కాలాహింగానక తన పనిఁ దాఁ జేయుచుండెను. అహితుండికుఁ డేదో యొకమూలికను జేతనుంచుకొని దాని ప్రక్కనే చూచుచు జాగరూకుఁడై యుండెను.

కొంతసేపటికిఁ దద్దృష్టులు తీవ్రరూపమును వదలెను. నిశ్వాసమారుతములు శీతలము లయ్యెను. ముప్పదాఱంగుళముల యెత్తుననుండు ఫణము పదియంగుళములకుఁ దగ్గెను. కన్నులు మూఁతపడియెను. నివాతదీపకళికంబోలి యుండెను. ఎల్లవా రచ్చెరువుపడి చూడసాగిరి మూఁడుముహూర్తము లనఁగా నాలుగడియ లట్లే యుండెను. ఆకాలాహికి స్మృతి కలదా యనుశంక గలుగఁజొచ్చెను. సర్పమున్నదా యనుకొనసాగిరి శాస్త్రి లేచి యెవరుగాని దానిని దాఁకుఁడు. అది యేమియు ననఁజాలదు. పెంపు రండు. ధీరోత్తములు లెండు. రండు. అని బతిమాలసాగెను. క్రిందుచూచువారు కొందఱు పరధ్యానము నభినయించువారు కొందఱు నైరి గాని లేచువాఁడు గాని, లేవ నుంకించువాఁడు గాని, లేవ నూహించువారుగాని మందున కందు లేకుండిరి. అహితుండికుఁడే నాలుగుమాఱులు పెట్టెను గదలించెను. ఫణాగ్రమున నడఁచెను. ఏమియుననక యది శవముగఁ గన్పట్టెను. ఇదేమి మాయయా, ఔషధప్రభావమా, యని యెల్ల రచ్చెరువందుచుఁ జూడసాగిరి. శాస్త్రి లేచి యార్యమహాశయులారా! సంగీతశాస్త్రపరీక్ష యనఁగా నిట్టిది. శంకరాభరణనామముగల యీరాగము సర్పములకుఁ బ్రీతికరము. దానియందు షడ్జస్వరము మయూరాధిదైవతమగుట వానికి విరోధము. ఆ విధ

మెఱింగి పాడినఁగాని భుజంగములు తన్మయత్వము నొందవు. ఇపుడీకాలాహి తన్మయత్వము నొందినది. పాట నిలుపఁగా యథాపూర్వరూపము గలదగును. రాధిక శాస్త్రవిహితపద్ధతిని మీఱక రాగము పాడినదని మన మెఱుంగవలయును. ఇది విషమపరీక్షయే యనక తప్పదు. అహితుండికుఁడు సమర్థుఁడు. రాగ మెట్లుపాడినను బాధలేకుండ నాఫణి నడంపఁ గలఁడు. ఆ విషయ మెఱింగియే యాతనిం బిలువఁ బంచితిమి. వయస్సున నా మెకుఁ బదునాల్గవవత్సరము సాగుచున్నది. ఇంత స్వల్పకాలమున నింతటిపాండిత్యము సంగీతమునఁగల్గుట పూర్వపుణ్యమే యనవలయును. ఉపదేశమాత్రమున సమ్యగ్గ్రహణశక్తి యీ కుమారికకుఁ గలదు. కావున నీమహాసభలో బహుమానముపొంద నర్హురాలని మనవి చేయుచున్నాఁడను. నా యీభావము మీ కెల్ల నంగీకారమయ్యెనేని ఆవిషయ మెఱుకపఱపుఁడని కోరుచుండెను. ఎల్లరేకవాక్యముగ నంగీకారమును దెలిపిరి.

తొలుదొలుతఁ బెద్ద లాశీర్వదించిరి. సువాసినులు మంగళములుగలుగఁ బాటలుపాడి సేసలుచల్లిరి. మహాజనాశీర్వాద మొక్కసారి సభాభవనము పిక్కటిల్లఁ జేసెను. అంతకుముందే యుపసంఘము వారేకాంతముగఁ బరీక్షించి యుండిరి. ఆసభ్యులభావము ననుసరించి సిద్ధముచేయించిన సువర్ణపతక మొండు తేఁబడియెను. తాంబూలముపైన దాని నునిచి పరీక్షకులు మూవురు సభ్యులకుఁ బ్రతినిధులై యా రాధిక కొసంగి శారదాకరుణాపాత్రతం గాంచి చిరకాల మాయుర్భాగ్యారోగ్యయశశ్శీలములు గలిగి వృద్ధినొందుమా

యని యాశీర్వదించిరి. ఆసమయమున నా కుమారికంగన్న తల్లి దండ్రుల యానందమిట్టిదని యెవ్వరు వర్ణింపఁగలరు? అది శక్య మగుపనియే కాదు. ఐన నొక్కఁడు లేచి,

తే. శీతకరు నుదయంబున • సింధుపట్లు,
ఘనతతిం గాంచినమయూర • గణమురీతిఁ,
బరమపూరుషుఁ గన్నట్టి • భక్తుపోల్కి,
నలరుచుండుత జనకుల • హర్ష మెపుడు.

అని దీవించెను పద్యభావము సరసజనహృద్యమని యెల్లరు మెచ్చు కొనిరి. కర్పూరదీపమును రాధికను నివాళించి తల్లిదండ్రులు ఘోటకశకటమున నింటికిం బిలుచుకొని పోయిరి. ఆసభా గౌరవమును బురస్కరించుకొని యాకన్యపాండితి నలుదెసల వ్యాపించెను.

---

# రెండవ వీచిక.

జాలంధరపురము నెఱుఁగనివారు మహారాష్ట్రులలో లేరనవచ్చును. ఆపురము చంద్రభాగకుసమీపమున నుండెను. శృంగారప్రధాననగరము కాకున్నను ధనసంపన్ననివాసము మాత్ర మగును. నడుమనడుమ గృహములు పాడుపడియుం డుట యది ప్రాచీనకాలమున సత్యున్నతదశ ననుభవించినదని చెప్పక చెప్పుచుండును. ఆచోటుల మరల గృహములు నిర్మింపఁ బడకయుండుటం బరికింపఁగాఁ గేవల శాస్త్రవిశ్వాసవంతు లందు విశేషించి కలరని తెలియవచ్చును. పాడుపడినతావుల గృహములు కట్టరాదని వాస్తుశాస్త్రనియమము గలదు. కావు

ననే యావల నిండ్లు కట్టుకొనుచుండిరి. ఆకారణమున నగరమం విశేషభూభాగము నాక్రమించెను. కాని నడుమనడుమ రిక్త తావు లుండుటంబట్టి చూచుటకు శృంగారముగ నుండదన వచ్చును దేవాలయములు పెక్కులుగలవు. జాలంధరి యను దేవత ప్రధానస్థానము నాక్రమించెను. ఆమెపేరున నానగ రము కట్టఁబడియెననియు, నంతకుఁ బూర్వ మాయాదిశక్తి యాలయము మాత్రమే యుండెననియుఁ, గొందఱు చెప్పు దురు. పెక్కండ్ర కాగాథయందే విశ్వాసము కలిగియుండెను. జాలంధరీదేవి భక్తరక్షణదీక్షగలదని యా నగరవాసుల విశ్వా సము.

శ్లో. "యేయథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్."

అని శ్రీకృష్ణమూర్తి తెల్పెనుగదా. ఏవిశ్వాసమున భక్తు లంబ నారాధింతురో యాలాటివిశ్వాసముననే యాజగజ్జనని వారిఁ గాపాడుచుండును. ఏఁటేట నాజననికి మహోత్సవము సాగును. ఆ యుత్సవదర్శనార్థము పెక్కుదేశములనుండి పెక్కండ్రు వ దెంతురు. వారిసంఖ్య మూఁడులక్షలు మొదలైదులక్షల దనుక నుండునని గణితజ్ఞులు నిర్ణయించిరి. ఇంద అరుదెంచినను నగర మున నివాసములకు శ్రమంపడ నక్కఱలేదు. ఎన్నియో దేవా లయములు, మఠములు, సత్రములు గలవు. మహార్ణవమున నదు లిముడునట్లు లాయాత్రికు లా నగరాంతర్భాగమున నడఁగి పోవుదురు. కావున నామహోత్సవము సామాన్యులకుంగూడ శ్రమము గల్గింపకయుండును. స్నానముల కానగరమునఁ గొదువఁ గల్గింపని తటాకములు గలవు సరస్సులు, వాపీకూప ములు గలవు. ఆయాయి దేవాలయములలో నన్న మాయుత్సవ

కాలములఁ బెట్టుధర్మాత్ములు గలరు. ఆకారణమునఁ దొమ్మిది దినము లుత్సవపరిమితిదైనను బూర్వాపరదినములు గలిసి పదు నైదుదినము లామహోత్సవము సాగుచున్నట్లే యుండును వస్తువు లన్నియు నల్పమూల్యమునకే దొరకును ఇన్నికారణములచే నాభగవతియుత్సవము నేత్రహృదయానందములను గలిగించునని యెల్లరవిశ్వాసము.

జాలంధరపురవాసులు కృత్రిమప్రవర్తకులు గారు. పౌరుషప్రధానులు. పట్టుదలఁ బూనిరేని "యశోవా మృత్యుర్వా" యన్న న్యాయము ననుసరించువారే కాని నడుమ వదలుకొని యేడుపుమోములు పెట్టుకొని యూరక యుండువారు మాత్రము కారు. మాటయిచ్చిరేని ప్రాణమునైన లెక్కింపక సాయపడుదురు. సాధారణముగా నుపకారబుద్ధి గలవార లనక తప్పదు జాలంధరిదేవి నారాధింపనివార లుందురాయన్న సందియమే. ఆమెకృపకుఁ బాత్రుఁడు కానివాఁడు నామధారియై యుండఁబోఁ డన్ననమ్మకము వారికిం గలదు. కావుననే మేలు కలిగిన నామె కరుణయే దానికిఁ గారణమని నమ్మి పూజింతురు. ప్రతివారును నుదుటఁ గుంకుమరేఖ యునుచుకొను నలవాటు గలవారే.

అట్టి జాలంధరపురమున శుక్రవారపుఁబేటయందు శ్రీవత్సాంకవాసను మహాధనసంపన్నుఁ డుండెను. సుగుణముల ప్రోవని కీర్తిగాంచెను. దినదినప్రవర్ధమానధనుఁడై వాసిమించెను. మంచియశము నార్జించెను. బంధుజనులఁ గాపాడి విఖ్యాతిం జెందెను. ఆశ్రితుల రక్షించి ప్రాశస్త్యమున దిక్కుల నావరించెను. ఆతనికళత్రము రూపవతియు గుణవతియు నగు

పద్మావతి. మంచిగుణము లీరూపమును ధరించెనా యన్నట్లు లామె యుండును. ఏమి యాదాంపత్యము ఘటించిన శతధృతి నేర్పు ? ఎంచఁదరమా యని కవికులగ్రామణులు సముచిత పద్యముల నాతనిం బాడుదురు. వారికిఁ గొంతకాలమున కొక్క కుమారుఁడు కలిగెను. ఆతని పేరు శ్రీకృష్ణదాసు. తల్లిదండ్రుల పుణ్యములపంటయనఁ గాదనరాదు. ఔననియే యొప్పుకొన వలయు. పంచమవర్షమున నొకనాఁడు శుభముహూర్తమున నక్షరాభ్యాసముహూర్తమును బెద్దలు నిర్ణయించిరి. మహాదాత యగు నాశ్రీవత్సాంకదాసుచే నాహూతులై కొందఱు, పిలువఁ బడకున్నను మఱికొందఱుగాఁ బదివేలవిద్వాంసులు గూడిరి. మహారాష్ట్రదేశమున నిఁకఁ బండితు లట్టివారు సభకు రాని వారు కలరా యనుశంక కలుగవలసినదే. అందఱుపండితు లరుదెంచిరి. రామదాసను యోగిపుంగవుఁ డొక్కఁ డా దేశమున నుండి పిలువనిపేరంటముగా నాకస్మికముగ వచ్చెను. ఎంత ప్రార్థించినను రానియోగి యెట్లు వచ్చెనా యని పండితులు పామరులుం గూడ నచ్చెరు వొందసాగిరి. వారిరాక కాదాసు పరమానంద పరిపూర్ణహృదయారవిందుఁ డయ్యెను. మనయదృష్టమే యీమహానుభావుని దోడితెచ్చెనని యాతనిపురంధ్రి యూహించి నిశ్చయించెను ఏదో యొక గొప్పలాభము కలదని యాదంపతులు నమ్మిరి.

రామదాసుకథ యించుక యెఱుంగందగినది. ఆతఁ డే కులమున జనించినవాఁడో యెవ్వరెఱుంగరు. ఏకడనుండి వచ్చెనో తెలియదు. ఎందుల కీదేశమున నున్నాఁడో యెఱుఁగఁ దరముగాదు. ఏవిద్యయందుఁ బండితుఁడని తెలియ శక్యమే

కాదు. ఏశాస్త్రమున నేసందేహమునుగూర్చి ప్రశ్నించినను వెంటనే బదులువచ్చుటం జేసి సర్వశాస్త్రములు వచ్చునని తెలియఁ దగుఁగదా. కృత్రిమబుద్ధిని బ్రశ్నించినచో బదులే రాదు. దానింబట్టి యీతఁడు పరేంగితావగాహి యగు బుద్ధి గలవాఁడని తేటపడును. మఱియు దివ్యదృష్టిగలవాఁడనియు నూహింపఁ దగును నూత్నవయస్సు కాదుగాని నలువదియేండ్లకు మించియుండదని యాతనిరూపము తెల్పును ఎవ్వరికి నామహానీయమూర్తివలన బాధ కలుగదు. అడిగిన నన్నము పెట్టుదురేని భక్షించును. లేదన్న నూరకయుండును. మనుష్యులకూటమి నాయోగి యాశింపఁడు విజనస్థలముననే యా దాసుండును. ఎందఱో పరీక్షించిరి. కాని యొక్కదోషమైన నున్నయట్లారోపింపనేరక నోరుమూసికొని యూరకుండిరి. ఎవ్వరేని విశేషించి ప్రార్థించిన సమాధానముగనున్న వచ్చును. ఎవ్వరింటి కాతఁ డరుదెంచునో వారికి మహత్తరశుభములు గలుగునన్న ప్రవాద మొక్కఁ డెల్లతావుల వ్యాపించెను. సర్వదా రామనామమును బలుకుచుండువాఁడు. విశేషించి దేవీసమారాధకుఁడు. అట్టి వారికి దేవతలయందుఁ దారతమ్యము గలదనుభావ ముండదు ఎల్లతావుల నొక్కపరమాత్మనే వారు చూచుచుందురు కావున నేదేవతయైనను వారికి సమానభక్తిచేఁ బూజింపఁబడఁదగినదై యుండును.

ఆమహాత్ముఁడే యా యక్షరాభ్యాసముహూర్తమునకుఁ బిలువకపోయిన నరుదెంచెను. ముహూర్తము సమీపించుచున్నదని మౌహూర్తికులు తెలుపుచుండిరి. సర్వాలంకృతగాత్రుఁడై బాలకుఁడు కన్నులపండువు చేయుచు నాడుకొను

చుండెను. దాసు సంతర్పణముచేయ సర్వసంభారములు సిద్ధముఁ జేయించియే యుండెను. నవనీతము దెచ్చి కాఁచి నెయ్యింగూర్చి యొకసుధామయస్థలమునఁ బోసియుండిరి. ఆగచ్చుతొట్టి బాహువుమాత్రము లోఁతుగ నుండెను. ముహూర్తకాలము సుముహూర్తమునకు వ్యవధియుండనపు డా బాలుఁ డాడుకొనుచుఁ బోయి తటాలున నానేతితొట్టిలోఁ బడెను. తోడి బాలురు కేకలిడిరి. శ్రీకృష్ణదా సగపడ లేదు. తల్లి పరుగునవచ్చి బాలకు నెత్తుకొనెను. ప్రాణము లంతకుముందే పోయియుండెను. ఆసాధ్వి యావిధ మెఱింగి కార్యగౌరవము నాలోచించి కంటఁ దడిపెట్టిన నిందఱకు భోజనము లేకపోవును. మఱియు రామదాసుగారు పిలువకయే దయచేసిరి. పండితమండల మున్నది. ఆశీర్వచన ప్రభావమున నీబుడుతఁడు బ్రదుకక యుండునా. అని నిశ్చయించి దేహముతుడిచి చెఱఁగు వానికిం గప్పి సుముహూర్తకాలము వచ్చుచున్నది. రమ్ము రమ్మని చీరు భర్త చెంతకుం బోయి నిలుచుండెను బాలకుఁడు నిద్రించుచున్న వాఁడని మేలుకొనుసమయమని యామె చెప్పుచున్నపుడు స్వరము మాఱియుండినను, ఆతొందఱలోఁ బెనిమిటి కనిపెట్టఁ జాలకుండెను.

అంతలోఁ గూరుచుండుఁడని పురోహితుఁడు విన్నవింప నెల్లరుఁ గూరుచుండిరి. పెద్దలంద ఱొక్కసారి యాశీర్వదించిరి. వేదనాదము పరమపవిత్రము గదా. అక్షతలు చల్లిరి. అత్తఱి రామదాసుగారు చెంతకు వచ్చి "దీర్ఘాయుష్మాన్భవతు" అని యాశీర్వదించెను. బాలకుఁడు లేచి కూరుచుండెను. ఆ తల్లి యానందమునకుఁ బరిమితియుండునే. తంత్రము కొంత

సాగఁగా రామదాసుగారే విధివిహితముగా నక్షత్రాభ్యాస కర్మము నడపిరి. భోజనము యథావిధి సాగెను భూరిదక్షిణ లొసఁగఁబడియెను. పండితులు పరిపూర్ణమనోరథులై తమ తమయిరవుల కరిగిరి. రామదాసుగారా శ్రీవత్సాంకదాసుతో జరిగినదంతయుం దెలిపి యిందులకై వచ్చితినని చెప్పి యాతని సాధ్వీమణి గొప్పబుద్ధిని బొగడి యామె గొప్పఁదనమే యింతకు మూలకారణము సుమీ యని హెచ్చరించి తనయిచ్చం బోయెను. అనుకూలభార్యావంతుఁ డెంత యదృష్టవంతుఁడో కదా యని తనమదిఁ జింతించుచు నాదాసు నెమ్మదిగ నుండెను.

శ్రీకృష్ణదాసు క్రమక్రమముగఁ జదువను వ్రాయను నేర్చుకొనెను. మఱికొంతకాలమునకుఁ జక్కఁగాఁ గావ్యనాటకాదులం బఠించి చక్కనిసాహిత్య మలవఱచుకొనెను. మహారాష్ట్రభాషయందు నాబాలకునితోఁ దుల్యుఁడు లేఁడన్న విఖ్యాతి వ్యాపించెను. పదునాఱవయేడు వచ్చునప్పటికిఁ గులోక్త కర్మకలాపము చక్కఁగా జరపఁబడఁగా నాతఁడు విద్వాంసుఁడు కూడ నయ్యెను. వివాహప్రయత్నము చేయవలసినదని పెద్ద లపుడపుడు త్వరపెట్టసాగిరి. కులోద్ధారకుఁడగు కొడుకొక్కఁడే చాలునన్నసామెత యాదంపతులకుఁ దృప్తిని గల్పించుచుండెను. భార్యయు సమయమును గనిపెట్టి ప్రస్తావవశమునఁ బెండ్లిమాట యాలోచింప సమయ మిది కాదా యని యడుగుచుండెను. నేను నాప్రయత్నము చేయ నెంచితినని యాతఁడు సమాధాన మిచ్చుచుండెను. ఆవిషయమును విని పెక్కండ్రు తమకొమరితల నిత్తుమని సువార్తలఁ

బంపుచుండిరి. ఆలకించియు బదులాడక సంతోషము సంతోష మని బదులుగనాడుచు నుంత కాలము ద్రోయుచుండెను.

శ్రీకృష్ణదాసు రాధికవిఖ్యాతిని బెక్కండ్రు పేర్కొన వినుచుండువాఁడు. సంగీతపరీక్ష సాగి బహుమానముపొందిన యా ప్రఖ్యాతిని గూడ నాలకించెను అంతట నా రాధికను బెండ్లియాడఁ దలంచుకొనియెను. కాని తల్లిదండ్రులయభి ప్రాయ మెట్టిదో కనుఁగొనినపిదప నీవిషయము సిద్ధాంతము చేయవచ్చునని యూరకుండెను. అచ్చట రాధికయు శ్రీకృష్ణ దాసు గుణగణమును బెద్దలు గణుతింప విని యానందించుచుఁ దల్లిదండ్రులయాశయము నెఱుంగ వేచియుండెను. మనసున నొక్కని గోరినపిదప నింకొక్కనిగోరుట, స్త్రీలకు ధర్మముగా దనియుఁ బాతివ్రత్యమున కది భంగకరమనియు నామె తలం చుచు నుదాహరణము సావిత్రీచరిత్రమును జింతించుచు నా పతివ్రతాశిరోమణిని బొగడుచు నెంతటి మహత్త్వ మామె కీనియమమునఁ గల్గెనో యని లెక్కించుచు నపరిమితానంద మందుచు నుండెను.

## వివాహనియమము.

ఈవిషయము నిక్కడ వ్రాయఁ దలంచుకొను టనుచి తము కాదు. కన్యక పుట్టినది మొదలు తల్లిదండ్రులు తగినవరు నెమకుచుందురు యుక్తవయస్సు, కులము, గుణము, శీలము, శ్రీ, విద్య, తల్లిదండ్రులయలవాటులు కన్యాజనకులు పరీక్షించు చుందురు. కన్యకామూలమునఁ దమవంశమున కేలాంటికళం కము రాకయుండవలయునని వారికోరికలలోఁ దొలుతటి దన వలయు. ఈవిషయమునఁ దల్లికంటెఁ దండ్రియే యెక్కుడు

భారము మోయఁదగియుండును. తల్లియూహాలు కొన్ని విషయములయందుఁ గుఱుచలగుచుండును. దండ్రియూహాలు సాగుచుండును. కావునఁ దండ్రి యత్యంతశ్రమముల ననుభవించియైనఁ గొమరితకు ననురూపుఁ డగువరు నరయును. వరుని తల్లిదండ్రులు నిట్లే యనురూపకన్యాన్వేషణతత్పరులయియే యుందురు. తల్లిదండ్రులు కాక బంధువులందఱుఁ దగినస్థలమును నెమకుదురు గాని యది యంత పరిగణింపఁదగినది కాదు. కన్యక పదివత్సరములకంటె మించని యీడుకలదిగనున్న తఱినో యంతకు రెండేండ్లముందుగనో వివాహముచేయు నలవాటు ప్రాచీనాచారమునఁ బ్రసిద్ధిం గాంచినది. అంత చిన్నతనమునఁ బెండ్లిచేయఁదగునా యని కొంద అందురు. అది మిగులఁ బొరపాటు.

మానవులకెల్లరకుఁ దఱచుగా మనస్సు తెల్లవారుజామున (అనఁగా నుషఃకాలమునందు) నిర్మలముగా నుండును. ఆకాలమునందే వేదము చెప్పుదురు. ఏలనఁగా నితరకార్యములయందు వ్యాపృతము కాకయుండును గాన దానికి గ్రహణశక్తి యెక్కువగా నుండుననియే యనవలయు. మఱి కొలఁదిగడియలకది సర్వతోముఖముగ వ్యాపించును అట్లే కన్యావరులమైత్రి చిన్నతనమునందే కలిగినచో నది దృఢముగ నుండఁజాలి చిరకాలము నిలుచును శాస్త్రోక్తవయః పరిమితియందు నా యిరువురచిత్తములు చంచలతం గాంచియుండవు. ఆతరుణమునఁ గన్యక వరుఁడీతఁడు యావజ్జీవము నా కాధారభూతుఁడు. ఈతనివదలిన నాకు గత్యంతరము లేదు. ఈతనియాజ్ఞ భగవదాజ్ఞవంటిది. మీఱరానిది

నాయావత్సుఖదుఃఖముల కీభర్తయే పరమగతి యనుభావము వివాహకర్మమున నేర్పడును. ఆభావము నిశ్చంచల మనవలయును. తదనుగుణముగాఁ గన్యక యతనియందే బద్ధానురాగము కలదగును భర్తయు నట్లే యనురక్తుఁడయి యుండును నడుమ నడుమ నేవో కుటుంబమునఁ జిక్కులు గలిగినను దృఢతమ ప్రేమానుబంధము నవి నిర్మూలింపఁ జేయఁజాలవు. ఈవిషయమును జక్క నాలోచించియే పూర్వులు కన్యావరులకు వివాహవయోనిర్ణయము గావించిరి. అంతియకాని పదివత్సరముల కీకన్యకకు సర్వప్రపంచవిషయములు తెలియఁగలవని కాదు.

వయస్సు చక్కఁగా వచ్చినపిదపఁ గన్యక తానే వరుని గోరుకొనుట మంచిదిగాదా యని యడుగవచ్చును. అది యంత మంచిదికాదనుటయే సమాధానము. లోకజ్ఞానము సంపూర్ణము కాఁగా నెవనిఁ బెండ్లియాడవలయునా యను చింత గలుగు. తనమేలుకీళ్లకుఁ దానేకర్త ననుజ్ఞానముకూడఁ గలుగు. లోకజ్ఞాన మూరక గలుగదు. పెక్కుకష్టముల ననుభవించి వానిఁ దప్పించుకొని మనవలయును. ఆజ్ఞానము వయస్సు మీఱినతర్వాతఁ గాని కలుగదు. విద్య కొద్దిగనభ్యసించి యాయల్పవిద్యచే లోకజ్ఞానము కలదనుకొనుచుఁ దన మేలునుగూర్చి తానే ప్రయత్నించిన నది యవివేకకార్యతుల్య మగును. వరుని సుగుణదుర్గుణములను గొంతకాలము పరీక్షింపవలయును. ఆతఁడు సరిపడకున్న వేఱొకనిఁ బరీక్షించుకొనవలయును. దానఁ గొన్ని చెడుగులు గలుగక మానవు. కొన్ని విషయముల మేలుకూడ నుండుననక తప్పదు. కాని

చెడుగులే యధికమనవలసి వచ్చును ఈవిషయము లాలో చించియే మనవారు తల్లిదండ్రులే వరునిఁ బరీక్షించి కొమరితకు వివాహము చేయవలయునని శాసించిరి. పౌరుషము ప్రధానముగాఁ గలరాజకన్యకలకు స్వయంవరము నిర్ణయించిరి. కొందఱు తమకొమరితలను గుమతికిచ్చి యామెను గష్టముల పాలుచేయు చుందురు గదాయన్న లేదనరాదు సామాన్యవిధి యని విశేష విధియని రెండువిధులు గలవుకదా. ఒకానొకచోట నెట్టివిధికిని బరిహారము కలుగక మానదు. కావున దానింబట్టిచూచినఁ గష్టములకంటె సుఖములే యెక్కుడుగ నుండునని చెప్పక తప్పదు.

కన్యావరులు పరస్పరము రూపమునుగాంచి ప్రేమించిరయే నది స్వల్పకాలమున మార్పునొందును గాని చిరతరముగ నుండఁ బోదు. శీలగుణములం బరికించి ప్రేమింతురేని శాశ్వతముగా నాప్రేమ ముండును. అట్లు ప్రేమించుట సర్వజనసాధారణముగ శక్యము కాదు. కావుననే పెద్దలు చిరకాలము జీవించి యరోగులు దృఢగాత్రులు నగుట స్వానుభవమున వరాన్వేషణము చేయుపని తల్లిదండ్రులదే యని శాసించిరి.

శ్లో. "కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా వయః,
బాంధవాః కులమిచ్ఛంతి పక్వాన్న మితరే జనాః."

యనుసూక్తి యొకఁడు వినఁబడియెడు. ఈవివాహపద్ధతి కొన్ని వేలయేండ్లుగ నలవాటుపడి చెడుగున కవకాశము లేకయున్న దనవలయు.

ఇఁకఁ గథకు మరలుదము. రాధికకు శ్రీకృష్ణదాసునకుఁ బరస్పరగుణశ్రవణమూలమున ననురాగము పొడమెనని యీవఱకే చదివితిమికదా. మనస్సులోనిమాట నించుకే వెలిపుచ్చక వారుండిరి. పెద్దలయందు వారికిం గలవిశ్వాసమెట్టిదో చూచితిరికదా. అట్లుగాక వారిరువురు తల్లిదండ్రులమాటఁ దలపెట్టక స్వేచ్ఛగా లేఖల వ్రాసికొనియో దూతికామూలమున స్వాభిప్రాయములఁ దెలుపుకొనియో యొకానొకచో నిరువురును గలిసికొని ప్రేమమును దృఢపఱచుకొనియో యిందునేది చేసియుండినను వారిచరిత్రము మీవంటి పాఠకమహాశయులమది కెక్కియే యుండదు. స్వేచ్ఛాప్రవర్తకులకుఁ బాత్యములగు గ్రంథములయందు నది వెలయుచుండఁగలదు. అట్లుగాక సావిత్రీసత్యవంతులవలె వారిరువురును బెద్దలమాట వేదతుల్యమని భావించినకతన వారిచరిత్రము వనితలకెల్లరకు నుదాహరణభూతమయ్యెను. కొలఁదిదినము లిట్లు గడచెను.

ఇందిరాదేవియుఁ దనభర్త నుచితరీతిఁ ద్వరపెట్టసాగెను. ఆజాతివారి కామహారాష్ట్రదేశమునఁ బదునాలుగేఁడులు మించకయుండ వివాహముచేయు టాచారమఁట. ఆనెపమున నాపురంధ్రీమణి ప్రాణనాథా! రాధిక విదుషి యయ్యెను. పదునాల్గవవత్సరము వెడలుసమయము రానున్నది మనకు లాచారమురీతి నింకను జరపుట పాడిగాదు కదా. కావునఁ బెద్దలయలవాటును దాఁటక వివాహప్రయత్నము చేయుటుచితమని నాకుం దోఁచెడిని. మీరేమి యూహించితిరో తెలియఁగోరియున్నాను. అని వినీతిఁ బల్కెను. శ్రీనివాసదాసు పత్నీవాక్యములను విని చిఱునవ్వు నవ్వి నీ నడుగు

టకుముందే చెప్పవలయునని యూహించితిని. నాప్రయత్న మంతయు ఫలించినపిదప నీకుం దెల్పి నిన్ను సంతోషింపఁ జేయ నెంచితిని ఆయూహ ఫలింపకముందే ప్రశ్నించితివి. నీకుఁ దెలుపక నే నేకార్యమైనఁ జేసినఁ బెద్ద లంగీకరింతురా? ఇఁకఁ జెప్పెదను. ఆలకింపుము రామదాసు నాహ్వానించి యామహాత్ముఁడు చెప్పి నట్లు చేయఁదలంచితిని. ఆయోగి నాకు హితముపదేశించినట్లే వరునితండ్రికింగూడ నుపదేశింపఁ గలఁడని నాభావము. దాని కొఱకే ప్రయత్నించు చున్నాఁడను. నాయీప్రయత్నము ఫలించెనేని మనరాధిక యనురూపుఁడగు భర్త కలదగును;అదృష్ట వతులలో నుత్తము రా లగును. ప్రేయసీ! నిన్నింకను గష్టపెట్టుట న్యాయము కాదు. శ్రీకృష్ణదాసు జాలంధరపురమునఁ బద్మావతీ శ్రీవత్సాంకదాసులకుఁ బుత్రుఁడని సుగుణవంతుఁడని వినియున్న దానవు కదా. ఆబాలకునికే మనరాధికనీయఁ బ్రయత్నించుచున్న వాఁడ. రామదాసుమాటయన్న నాబాలుని తల్లిదండ్రులు శిరసా వహింతురు ఆరామదాసు నాయందుఁ బరమాదరణము గల వాఁడు. కావున వారిమూలమున నీసంబంధము దృఢపడునట్లు చేయఁదలంచి యున్నాను. ఎవ్వరికే నీవిషయముఁ దెలియనీయ కుము. అసూయకులు లోకమునఁ బెక్కండ్రుందురు. జాగ్రత్తగా మది నిల్పుకొనుము. కార్యసిద్ధియయ్యెనేని మనమే యదృష్ట వంతులము. విశేషించియే ప్రయత్నించుచున్నాఁడను. అని పలుక నాయిందిరాదేవి ప్రమోదార్ణవ పరిమగ్నహృదయ యయ్యెను. శ్రీనివాసదాసును స్వప్రయత్నమున బద్ధాదరుఁడయి యుండెను.

---

# మూఁడవ వీచిక.

---

ఒక్కరి గొప్పతనమున కసూయపడుచుండుట మానవ సామాన్యస్వభావము దుర్గుణములయం దెల్ల నసూయ ముందుగఁ బరిగణింపఁబడును దానివంటిది వేఱొకఁడు లేదని పెద్దలందురు. అది యొక్కఁడున్న దికదా యనరాదు అన్ని దుర్గుణము లుండినఁ గాని యది నిలువఁజాలదు కాన నసూయ యుండిన నన్ని యవగుణము లుండినట్లే యూహింపవలయును. లోకమున నసూయయే పెక్కండ్ర బాధించుచుండును. ఎందఱి గొప్ప తనమునకో యపకీర్తిని గల్గించుచుఁ దాను రాజ్యము చేయుచుండును. దాని జయించుటయే దిగ్విజయమనంబడును. దానిని జయింపక యెన్ని దేశముల జయించిన నది విజయము కానేరదు. ఆవిజయమునఁ దనకు సుంతయు మేలు లేదు. అసూయను జయించినవాఁడే భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁ డగును.

విలాసధామమున నిరువురుమిత్రు లుండిరి. వారు శ్రీనివాసదాసుతెగకుఁ జేరినవారే. ఇందిరాదేవి పితృపక్షపువారు. వారు సోదరులు గారు. కాని వారింబట్టి సోదరులవంటివారే. ఒక్కనిపేరు పాతాళుఁడు. రెండవవానిపేరు కుంతలుఁడు. పాతాళుఁడే యిందిరాదేవికి నించుక సమీపబంధువు.అనఁగా సోదరుఁడు. కుంతలుఁడు పాతాళునకు దూరపుసోదరుఁడు. వీరిద్ద ఱొక్క గురువుకడ నేమో మంత్రములు నేర్చుకొనిరి కావున సతీర్థ్యులు. కుంతలుఁడు స్వీయబుద్ధిప్రభ లేనివాఁడు. పాతాళుఁడు

మాయావి, టక్కు, టమార, గోకర్ణ, గజకర్ణములు లోనగు విద్యలయం దాఱితేఱిన మేటి. చూచుటకుఁ బరమసాధువుగనే తోఁచును కాని నిలువెల్ల విషమే. ఏమాట పల్కిన నందొక్క విషబిందువు లేకయుండదు. కావుననే యెల్లవారు వానిమాటలను నమ్మకయుండిరి. క్షుద్రవిద్యలయందు నిరుపమానపాండిత్యమును సంపాదించెను వానిచేఁ బామరు లాతని మాంత్రికుఁడని భ్రమపడి పిలుతురు. ఆభిచారికహోమములఁ జేయుచుండుట యాతనియలవాటులలో మొదటిది దానిచేఁ బెక్కం డ్రాతనికి భయంపడుచుందురు. కుంకుమరేఖ యతని కనుబొమలనడుమ విరాజిల్లుచుండును. కుంతలుఁ డాతనిననుసరించి మాంత్రికుఁ డనిపించుకొన్న వాఁడే. ఐనను బాతాళునిమాట జవదాఁటువాఁడు కాఁడు.

రాధికకు నించుక ప్రాయమురాఁగాఁ దనకా కన్యక నిమ్మని యిందిరాదేవికి వార్త పంపుచుండెను ఆమాటనే యామెచెవిఁ జొరనీయక యుండెను. చాలపర్యాయములా ప్రయత్నమును సాగించి యిఁక లాభములేదని నిరాశుఁ డయ్యెను. కాని మనస్సున నాకన్యకను హరించికొని పోయి పెండ్లియాడవలయునని నిశ్చయించుకొనియెను. దానికిఁ గావలయుపరికరములను సిద్ధముచేయుచుండెను. భరతపురమను గ్రామ మావిలాసధామమునకు మూఁడుక్రోశముల యంత దూరమునఁ గలదు. అది కుగ్రామమైనను భరతపుర మనుపేరును వహించెను. పూర్వమెప్పుడో నగరముగనే యుండెనఁట ఆగ్రామమునకుఁ దూర్పుదిశయం దొకదేవాలయము కలదు. అది ప్రాచీనమే కాని నవీనముగా నిర్మింపఁబడినది కాదు. దాని

నెవరు కట్టించిరో తెలియదు గాని దానినిర్మాణ మతివిచిత్రము. అందు రెండు గర్భాగారములు గలవు. ఒక్కదానియందు నృసింహమూర్తియు వేఱొకతావున మహాకాళియుఁ బ్రతిష్ఠింపఁబడిరి. ఆనిర్మాణము క్రొత్తది. మఱెందు నిట్టివిధము కానరాదు. దానిం గట్టించినవాఁడు నరసింహభక్తుఁడు. కాళీసేవకుఁడు కూడ నయినట్లు పొడకట్టక మానదు. ఈ యిద్దఱు దేవతలు క్రూరదేవతలని కొంద ఱందురు. కాని వారు క్రూరదేవత లేకాలమునను గారు. భక్తుల వాంఛలననుసరించి దేవతారూపము శాంతక్రోధములఁ దెలుపుచుండును. పేరునుబట్టి తత్త్వ మెఱుఁగనివారు పెక్కండ్రు క్రూరత్వసౌమ్యత్వముల నారోపింతురు. అది పొరపాటుగాని వాస్తవము కాదు. ఆ దేవాలయము భరతపురమునకు మిక్కిలి సమీపముగాఁ గాక దూరముగాక యుండును. దాని ప్రాకార మత్యున్నతమై యప్పుడు కట్టిన ట్లగపడును. ధ్వజస్తంభము కూడ నున్నతమైనదియే. నిత్యనైవేద్యదీపారాధనములు మాత్రమే సాగును. ఇరువు రర్చకులు. వారికిం దృప్తిగా భూములు కలవు. వాని ననుభవించుచు నావిగ్రహములం గడుగుకొని వారు బ్రదుకుచుందురు.

ఆదేవాలయమునఁ బెక్కుమండపములు గలవు. వివాహము లామండపముల సాగుచుండును. లక్ష్మీదేవి నృసింహస్వామివక్షమున నిలుచుటంజేసి యాదేవుని క్రూరత్వము ఫలింపదనియు మేలే కలుగుచుండుననియుఁ బామరులవిశ్వాసము.

శ్లో. 'యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ.'

అన్న పెద్దలమాట తప్పదుకదా. ఆదేవాలయమున మధ్యాహ్న సాయంకాలముల నర్చకు లుందురు ఇతర కాలములయందు మహర్షులు పావురములుగా వచ్చి యాదేవు నారాధింతురని కొందఱు వాకొనుదురు. ఎంతవఱ కది నిశ్చయమో కాని పావురములు మాత్రము కలరవములుచేయుచు గోపురము మీఁదను, విమానములపైనను దిరుగుచుండుట నిశ్చయము. ఆపావురములే మహర్షులు, ఆకలరవములే సామగానములు, అగునన్నఁ గాదనువా రెవ్వరు ?

ఆదేవాలయమునకుఁ బాతాళుఁడు కుంతలుఁడు పోవుచుండువారు. ఆయర్చకులు పాతాళునకు మిత్రులు. ఎప్పుడైన నతఁడు హోమముచేయుచు నాలుగుడబ్బులు పూజారుల కిప్పించుచుండుటం బట్టి వారు వానికి మిత్రులైరి. వారితో నొకనాఁడు పాతాళుఁడు తన మనోగతము ని ట్లెఱింగించెను. మీరు నాకుఁ జిరకాలమిత్రులు. ఎన్నఁడుగాని మీవలన నొక కార్యము కావలసియున్నదని చెప్పినదిలేదు. ఇపుడొకమహాకార్యము నాకుఁ గల్గినది. నావలన మీకు ముందెంతో మేలు కలుగఁగలదు. అది యిపుడే తెల్పుట న్యాయము కాదు. విషయమును వినుండు. దాని వెల్ప్రుచ్చమని ప్రమాణము చేయవలయును. అని వా రట్లే ప్రమాణముచేయఁగా నిట్లు తెల్పెను. మాపట్టణమున శ్రీనివాసదాసు గలఁడు కదా. ఆతనిభార్య నాతోఁబుట్టువు. చిన్నతనమునుండి తనకూఁతును రాధికను నాకిచ్చి పెండ్లిచేయుదునని వాగ్దానముచేయుచు నిపు డీయనను చున్నాఁడు. ఈకన్యకను నమ్మి యొందఱో కన్య

కల నిత్తుమన్న వలదంటిని. నన్ను నమ్మించి యిపు డిట్లుచేయుట న్యాయమా? ధనవంతుఁడు కాన నేది యెట్లుచేసినను జెల్లును. ధనహీనుఁడనగుట నాపక్షమున నెవ్వరు న్యాయముకూడఁ బలుకరు. కాలమహిమ యిట్లున్నది. కావున న్యాయమును నిలుపఁ బూని నే నొకయుపాయము చేసితిని. ఆకన్యకను నడికిరేయి నిటఁ గొనివత్తును. దేహస్మృతి లేకయుండఁజేసి తెచ్చెదను. మీరు రాత్రు లిందుంట వాడుక లేదు కదా. తలుపులు తెఱచి యుంచుఁడు. ఆరేయి వివాహము జరపుకొని యెందో పోవుదుము. మఱుదినము మీరందఱతో నెవరో తలుపులు తెఱచిరని చెప్పుఁడు. మీకేమియు బాధయుండదు. నాపనియు నగును. ఈయుపకారమునకై మీకెంతో ధనమిత్తును. ఆజన్మము మీకుఁ గృతజ్ఞుఁడనై యుందును. ఈవార్తను బదిలముగ మది నిలుపుఁడు. అని యుక్తియుక్తముగాఁ దెలిపితిని గదా యని సంతసించుచుఁ దెలిపెను. వారామాటల నమ్మి యట్లే కానిమ్మని యంగీకారమును దెలిపిరి.

ఒక్కనాఁడు కుంతలుని బిలిచి పాతాళుఁ డిట్లు బోధించెను. వ్యాధులు తొమ్మండ్రుగురు నామాట జవదాఁటక చేయువారు గలరు. ఈకృష్ణసప్తమీశుక్రవారము సాయంకాలము వారు నీయింటికి వత్తురు. వారి కన్నము పెట్టి తాంబూల మిమ్ము. జాముూరాత్రి కాఁగా నిరువురు మనుష్యులు సురాభాండములఁ దీసికొని మీయింటి వెనుకటిభాగమునుండి పిలుతురు. అందేయుండి తలుపుతీయుము. తొమ్మండ్రుగురు వ్యాధులు తనివితీఱఁ ద్రావుదురు. వారిం దోడ్కొని శ్రీనివాసుదాసు నింటి వెనుకటిభాగముకడకు రమ్ము. అందొక్క వటా

వృక్షము కలదు కదా. దానిమూలముకడ మీరెల్ల నుండుఁడు. లోపలినుండి యా రాధికను దీసికొని మేము వత్తుము. మన మండలము కలిసి భరతపురమునకుం బోవుదము. ఈనడుమ నీవు వివాహమంత్రములు నేర్చుకొనుము. దానికిం గావలసిన పరికరముల సిద్ధముచేయించి యుంచుము. అపుడు తడవుకొన రాదుసుమీ. నీవీకార్యమునఁ గడుజాగరూకుఁడవై యుండుము. నా కింతకంటె మేలుచేయు సమయమురాదని నమ్ముము. అని నచ్చఁజెప్పెను.

కుంతలుఁ డామాటలకు మదిజంకుచు నిట్లు హితముపదేశించెను. మిత్రమా! నీవన్నింటను జతురుండవని నే నెఱుంగుదును. కాని శ్రీనివాసదాసు ధనవంతుఁడు. మంచివాఁడని విఖ్యాతిం గాంచినవాఁడు. ఎవరినోటనుగూడ దాసు ధర్మాత్ముఁడన్నమాటయే వెడలును. ఇందిరాదేవి పతివ్రతాశిరోమణి. రాధికయు సంగీతసాహిత్యచిత్రకళలయం దసమానపాండిత్యమత్యల్పవయస్సుననే సంపాదించినది. ఆనాఁటిసభలో నా కన్యకకుఁ గలసంగీతజ్ఞానమును మెచ్చుకొననివాఁ డొక్కఁడైనఁ గలఁడే. అట్టికన్యకను దొంగిలికొని పోయి భరతపురదేవాలయమునఁ బెండ్లిచేసికొనుట యసంగతకార్యము. అది సాగుట కష్టము. సాగినదనియే యనుకొందము. మరల మన మీలోకమున మనఁగలమా! మర్యాదగల యేమానవుఁడైన మనలఁ జేరనిచ్చునా! కావున నీ కార్యము మానుట మంచిది. అంతియ గాదు. రాధికకు నీకును హస్తిమశకాంతరము గలదు. ఆమె రూపవతియగుటయే గాక విదుషీమణి. నీవో నిరక్షరకుక్షివి.

నీకాకన్నియఁ దగినది కాదు. ఆప్రయత్నము మానుమని మఱి మఱి నొక్కి చెప్పెను.

పాతాళుఁ డాతనిం గాంచి నవ్వి యిట్లు పలికెను. వెఱ్ఱివాఁడా! పెండ్లి కానిమ్ము. ఆవల నన్నుఁ గన్యాజనకు లేమియుఁ ననఁజాలరు. రెండుమూఁడుదినము లాగ్రహించి మరల సాదరముగాఁ జూతురు. మరల నింకొక్కనికిచ్చి పెండ్లి చేయఁ జాలరు. అట్టియాచారము లేదుకదా. విధి యిట్లున్న దని క్రమక్రమముగా నాయందుఁ బ్రీతిఁ జూపుదురు. కన్నియయు నీకఁ దప్పదుకదా యని నన్నుఁ బ్రేమించును. అన్నియు సరిపడును. నన్నే యెల్లవా రాశ్రయింతురు. ఆయింటి కధికారిని నే నగుదును కావున జంకుమాని నాయా నతిఁ జేయఁబూనుము. మంచిలాభమును బోఁగొట్టుకొనకుము. అని గట్టిగాఁ బలికిన నేమియుననఁజాలక కుంతలుఁ డట్లే యొన రింతునని యంగీకరించెను.

ఆమీఁదఁ బాతాళుఁ డింటికిం బోయి యంబాపూజార్థము కొన్నివస్తువుల సేకరించెను. తనమాటలో మెలఁగు వారికెల్ల నీవిషయము తెలిపెను. వారెల్ల సిద్ధముగ నుండిరి. కొన్ని మూలికలం దెప్పించి యొక యంజనద్రవ్యము సిద్ధము చేసెను. మఱికొన్నివస్తువులం గలిపి విస్మృతిని గల్గించుపాన కము సిద్ధపఱచెను అడవినుండి యుడుముల నాల్గింటిని దెప్పించి కాపాడుచుండెను. తనకుఁగల మంత్రవిద్యాపాండి త్యమునకు ఫలముగా నన్నిపనులు సిద్ధముచేసికొని వేళకై వేచియుండెను.

పాతాళునకుఁ గర్ణపిశాచికావిద్య తెలియును. దానినే చక్కఁగ నారాధించువాఁడు. అది క్షుద్రదేవతయే యైనను గొన్నికొన్నిసమయములయందు విశేషించి యుపకరించును. తిరస్కరిణి యనువిద్య యతఁ డెఱుంగును. దానిచేఁ దానితరులకుఁ గనఁబడకయుండ నుండఁగలఁడు. అట్లుండుట కొలఁది ముహూర్తములే యైనను జమత్కారముగ నుండుటయే గాక యల్పముగ సాయము కూడ నగును కదా. అట్టి కార్యముల వలన ముందు హానికల్గినను దత్కాలము మహోపకారముగ నావిద్య కనఁబడును. పెక్కుమూలికల నాతఁ డెఱుంగును. వీనియన్నింటిసాయమున నాఘనకార్యమును జేయఁబూనెనే కాని విధి వీనినన్నింటిని మించి పనిచేయఁ గలదుగదా యను నూహ యాతనికి లేకయుండెను. దేవతలచే నీచకార్యము చేయింపఁ బ్రయత్నించిన నవి యెదురెక్కి తన్నే మృతినొందఁ జేయునన్నవిషయము నెఱుంగఁ జాలినంత జ్ఞానము కలవాఁడు కాఁడు. విశేషించి యైహికఫలములే ముక్తిఫలాధికము లనుకొనునల్పుల కట్టివిశేషవిషయములు గోచరింప వనుట నిక్కము. నాలుగుదినములు కొఱఁతగా నాతఁ డనుకొన్న కాలము ముగిసెను. త్వరపడవలసిన యవసర మేర్పడియెను. కుంతలాదులను హెచ్చరించెను. వారు చెప్పినట్లు చేయ సిద్ధముగా నుండిరి.

విలాసధామముననే యొక్క శ్రోత్రియబ్రాహ్మణుఁడు కలఁడు. ఆతని పేరు శంకరాభరణశర్మ. అనంతాచలశర్మ యనియు నాతనిఁ బిలుతురు. రెండవపేరే ప్రసిద్ధమయ్యెను. ఆభూసురుఁడు దరిద్రుఁడు. కాని యయాచకుఁడు ప్రాప్తలాభ

మున నానందించువాఁడు. అనురూపవతియు ననుకూలప్రవృత్తి మతియు నగుకళత్ర మాతనికుండెను. మంచి శాస్త్రపాండిత్యము గడించియు గర్విగాక శాంతధనుఁడై యేమియుఁ దెలియనివానిచందమున నుండువాఁడు. ఆతనికడఁ జదువుకొనుశిష్యులు కొందఱు గలరు. మంత్రవిద్య యాతని సొమ్మనవలయు. భరతపురమునఁ గలకాళికాదేవి కాతనియందుఁ బ్రీతి యధికము స్వప్నమున దర్శనమిచ్చుచుండును. కాని యావిషయమాతనికి నాదేవికిఁ దప్ప నితరులకెఱుఁగఁ దరము గాదు. కొంద ఱుపాసకు లావార్తను బలుకుచుందురు. ఏది యెట్లున్నను దేవీపూజాతత్పరుఁ డనుట కావంతయు శంక లేదు.

క్షుద్రవిద్య లాతఁ డెఱుంగఁడు. కాని పాతాళుఁ డన్యాయప్రవర్తకుఁడని నీచమతియని పరమఘాతుకుఁడని యాయన యెఱుంగును. శ్రీనివాసదా సెప్పుడో యొకప్పు డనంతాచలశర్మను జూడఁబోయి రాధికావివాహమునుగూర్చి ప్రస్తావించియుండెను. ఆయాలోచనము మంచిదని యాతఁడు హిత ముపదేశించెను. అంతమాత్రపుఁ బరిచయమే కాని విశేషసంబంధ మాయిరువురకు లేదు. రాధిక విద్యావతి, గుణవతి యని యాతఁ డెఱుంగును. కాన విద్యాపరీక్షాదినమున నాతఁడు నాహూతుఁడై వచ్చి మెచ్చుకొనినవారిలోఁ బ్రథముఁడుగ నుండెను. ఆనాఁడు మొదలుకొని యపుడపుడు రాధికకుశలముల నరయుచుండువాఁడు. విశేషించి శిష్యుల మూలమున నాకన్యక కుశలముల నెఱుఁగుచుండెను.

పాతాళుని మిత్రకోటిలో నొక్కఁడు చాలకాలము నుండి యనంతాచలశర్మకడ విద్య నభ్యసించుచుండువాఁడు. వానిపేరు తుహినకిరణశేఖరుఁడు. బుద్ధిమంతుఁడే కాని పాతాళునిస్నేహమున నించుక నీచకార్యముల నొనరింప సాహసించుచుండువాఁడు. ఆకార్యము గురువులకుఁ దెలియకుండ నేచాటుననో చేయుచు జంకుగలిగియే యుండువాఁడు. పాతాళుఁ డాతనిని దనప్రియమిత్రులలో నొక్కనిగా భావించుచుఁ దనరహస్యములెల్లఁ దెలుపుచుండెను. ఆవాడుక చొప్పున వివాహప్రయత్నము తాఁ జేయుటయు దానికిఁ గుంతలాదులు తోడ్పాటు చూపుటయుఁ దెలిపెను. మఱెవ్వరితో నీవిషయము తెలుపరాదని చెప్ప మఱచిపోయెను. తనప్రియమిత్రుఁడన్న విశ్వాసమే యీప్రమాదమునకు హేతువని చెప్పవచ్చును.

తుహినకిరణశేఖరుఁడు రాధికం బాతాళుఁడు దొంగిలికొనిపోయి భరతపురదేవాలయమునఁ బెండ్లియాడఁ జేయుచున్న ప్రయత్నములను మాటవెంబడిని సంగ్రహముగ గురువునకుం దెల్పెను. పిదప నిది యిట్లు జరగుట దైవవశముననే యనుకొని యతఁడు గుటకలు మ్రింగసాగెను. అనంతాచలశర్మయు నామాటల విని విననట్లు నటించి యెట్లో పాఠము ముగించి శిష్యులనెల్ల సాగనంపి తనలో నిట్లు తలపోయఁ జొచ్చెను. "పాతాళుఁడు పరమదుర్మార్గుఁడు. క్షుద్రమంత్రతంత్రముల నెఱుంగును విశేషించి ఘాతుకుఁడు. ఎట్టివారినైన స్మృతిలేకయుండ మూలికాప్రభావమునఁ జేయఁగలఁడని విన్నాఁడను. రాధిక నెట్లైనఁ గొనిపోయి పెండ్లియాడును.

లేదా బలియిచ్చును. కాళికాలయమున వాఁ డపుడపుడు నాభిచారికహోమములఁ జేయుచుండునన్న మాట నే విని యుంటిని. వాఁ డేప్రయత్నముచేయునో తెలియదు. ఈకార్య మును సాగకుండ నిపుడేచేసినఁ బాతాళునకు హాని గల్గును. నామూలమున నెట్టివానికిఁగాని హాని కలుగరాదు. కావునఁ దగినప్రయత్నము చేసెద. కాళికాదేవి నాయందుఁ గరుణ గలదియే యని నాకు విశ్వాసము కలదు. ఆజగజ్జననిం బ్రార్థించి రాధిక కించుకే నపాయము కలుగకయుండఁ బ్రయత్నించెద." అని తలపోసి తనశిష్యులలో మిగుల నుత్తములగువారిని నల్వురం బిలిచి రహస్యముగా నావృత్తాంతమంతయు నెఱిఁ గించి మీరు సప్తమీశుక్రవారమునఁ దొలిజాముననే పోయి యందెట్లో దాఁగియుండి పాతాళుఁడు రాధికను దెచ్చి పెండ్లి యాడఁ బూనుసమయమున వాని బంధించి కొని రండు. లేదా ముప్వు రందుండి గ్రామవాసులకుం దెలిపి వారిని దోడిచ్చి యొక్కని నిటకుం బంపుఁడు. పాతాళుఁడు పెక్కండ్రం గూడి వచ్చునేమో యనుభీతి మీ కుండదని నమ్మెదను. మీరు దేహబలముగలవారు. కృపాణపాణులగు మిమ్ము వా రెంద ఱైనను మార్కొని యోడింపఁజాలరని నావిశ్వాసము. అం దును భగవతికి ధర్మపక్షమున నభిమానము మెండు. మనము న్యాయపక్షము నవలంబించు వారము. న్యాయమున భగవంతుఁ డుండునన్న శ్రుతు లసత్యములు కావు. కావున మీ రీవిషయ మును రహస్యముగా నునిచి యాకార్యము నెఱవేర్పవలయునని తెల్పెను.

గురువునానతి శిరసావహించువారు గాన వా రామాటలు వినినంతనే శ్రద్ధాళువులై యట్లే యొనరింతుమనిరి. ఆ నలువురిలో వేంకటేశ్వరుఁడు సాముచేసినవాఁడు, బలశాలి, ధీరుఁడు నగును. కాళీచరణదాసు బలశాలియగుటయే గాక యుపాయముల నెఱింగినవాఁడు. ప్రత్యుత్పన్నమతియనం జనును రామకిశోరశర్మ జన్మదార్ఢ్యము గలవాఁడు. కార్యము పట్ల ముందువెనుక లాలోచించువాఁడు కాఁడు. అంతియ గాక ఖడ్గచాలనమున రెండవభీముఁడే యనవచ్చును. శ్యామసుందరుఁడు పైవారి నొక్కొకవిషయమున మించువాఁడే కాని సామాన్యుఁడు కాఁడు ఈనల్వు రిట్టివారు కాఁబట్టియే గురువుగారు రహస్యముగ నీకార్యము చక్కపెట్ట నియోగించెను. వారెల్లరు శుక్రవారము రాకకై వేచియుండిరి. అనంతాచలశర్మయుఁ దనయిష్టదేవత నారాధించుచు రాధిక కించుకంతయుఁ గీడుకలుగకయుండునట్లు కరుణింపవలయునని ప్రార్థించుచుండెను. తుహినకిరణశేఖరుఁడు పొరపాటున నీమాట యేల జాఱవిడిచితినని విచారించుచు గురు వీమాట నాలకించినజాడ కానరాలేదే యని మరలఁ దృప్తినొందుచు నుండెను.

---

# నాల్గవ వీచిక.

జాలంధరపురమున మహోత్సవము సాగుచుండెను. ఆదిశక్తి కేటేట నాయుత్సవము సాగునాచారము కలదని పాఠకులు ముందే చదివియుందురు. లక్షలకొలఁది మానవు లరు

డెంతురు. శ్రీవత్సాంకదాసు ప్రతివత్సర మాదేవ్యుత్సవ సమయమున నతిథులకు దీనాంధక బధిరకుబ్జులకు నన్న దానము చేయువాఁడు. ఆవత్సరము దైవవశమున మరల రామదాసు వచ్చెను. పరమానందమున నేదియో గొప్పశుభము కలుగఁగలదన్న విశ్వాసమున నారామదాసును బూజించుచు వచ్చిన వారికి మృష్టాన్నమిడుచు మహాదాత యనుఖ్యాతికిఁ దగియుండెను. పద్మావతి భర్తతో దాసుగారు వచ్చియున్నారు కదా. కుమారునకు వివాహమెచ్చటఁ జేయుమనునో యడిగి తెలిసికొని పిదప నాప్రయత్నము చేయఁగూడదా యని గట్టిగాఁ బ్రశ్నింపసాగెను. ఆప్రశ్నము యుక్తియుక్తముగా నున్నందున ధర్మపత్నితో నీచెప్పినట్లే చేయుదునని యొకనాఁడేకాంతమున రామదాసుకడంజేరి మెల్లగాఁ బ్రశ్నించెను. దాసు నవ్వి వత్సా! దైవప్రయత్న మనుకూలించుచున్నది. అప్రయత్నముగా నావివాహము సాగును నీ వూరకుండుము. నేనందులకే వచ్చినాఁడను. తగినకన్యక దొరకును. ఈయుత్సవమునకు విలాసధామమునుండి శ్రీనివాసదాసు వచ్చియున్నాఁడు. ఆతని నేదోయొకనెపమునం గాంచి మాటలాడుము. ఆతని కొక్కతుకయే పుత్త్రిక కలదు. ఆమెపేరు రాధిక. సుగుణవతి, విద్యావతి, రూపవతియు నగు నాకన్యక నీకొమరునకుం దగినది ఆదాంపత్యము వర్ణనాతీతమై సృష్టికర్తను వేనోళ్లఁ గొనియాడందగినదై యుండును. ఆతఁడును నా రాకకై వేచియున్నవాఁడు. ఒక్కకార్యము నామదికిం దోఁచినందున నిచ్చటికి వచ్చితిని. దాని నిపుడు తెలుపనయితి కాదు. కార్యాంతమున నెఱుకపడఁ దగియుండును. సమయోచిత

ముగ శ్రీనివాసదాసుతో మాటలాడుము. అని నచ్చఁజెప్ప శ్రీవత్సాంకదాసు తద్వాక్యమును శిరసావహించి యట్లే చేయ నిశ్చయించెను.

సాయంకాలమున శ్రీనివాసదా సుచితపరివారముం గూడి జాలంధరీదేవతాదర్శనార్థము పోయెను. జనులు క్రిక్కిఱిసియుండిరి. మార్గమున నిసుకచల్లినను రాలకుండెను. త్రోవకిరుప్రక్కల యాచకు లుండిరి. గోవిందా యనువారు కొందఱు, కన్నులులేనివాఁడ ననువారు కొందఱు, కుంటివాఁడను బాబూయనువారు మఱికొందఱు నిట్లు పెక్కుచందముల యాచించుచుండిరి. కొందఱు చెట్లక్రింద నిలుచుండి సుద్దులు చెప్పుచుండిరి. మఱికొందఱు దేవినిబాడుచు భక్తిరసమున మునిఁగినట్లు నటించుచుండిరి. ఇంకను గొందఱు కాశి రామేశ్వరము లోనగుక్షేత్రముల నద్దములలోఁ జూపుచుండిరి. ఒక్కతావున నొకరాటము తిరుగుచుండఁగా దానికొనల యందు వ్రేలాడఁగట్టిన కఱ్ఱగుఱ్ఱములపైఁ గూరుచుండి యొకఁడాచక్రమును ద్రిప్పఁగా గిరగిరఁ దిరుగుచుఁ బాటలు పాడుచుఁ దమరు రౌతులమనుచు నాగుఱ్ఱములఁ దోలుచున్న మార్గము నటించుచు నార్చుచుండిరి. మఱియొక్కతావునఁ జాలుగాఁ బరుండి కొందఱు పాషాణములఁ బయిని వైచుకొని ముక్కులు గనఁబడునట్లుండఁగా వారిప్రక్కన నొక్కరొక్కరు కూరుచుండి మహానుభావుని నీతనిం జూచిపొండు. ధర్మమేమైనఁ జేయుఁడని బతిమాలుచుండిరి. మఱికొన్నితావుల జూదరులు కూరుచుండి తమలోఁదామే యుద్దులుగా నాడుచుఁ దగవులాడుచు ద్రవ్యమును సంపాదించినట్లు

నటించుచు నితరులు వచ్చి యాడఁబూనిన మోసపుచ్చుచు ద్రవ్యము నాకర్షించుచుండిరి. ఇంకను గొన్నితావుల నాడుచుఁ బాడుచు స్త్రీలంగూడి వినోదములు సలుపుచు యాచించుచుండిరి. మఱియు నొక్కతావునఁ జచ్చినపాముతోలును బ్రదికింపఁజేసి దాని నాడించుచుఁ దమశక్తి కందఱు విస్మయింపడ నాలుగుడబ్బులిండని బతిమాలుచుండిరి. వీరినెల్లరఁ జూచుచు వచ్చినవారిలో మూఁడువంతులు జనులు కాలమును బుచ్చుచుండిరి

భర్తచనిపోయిన యాఁడువాండ్రు రాచిప్పలమ్ము నంగళ్లకడ నిలువఁబడి బేర మాడుచుండిరి. ముత్తైదువులు కుంకుమము, అద్దములు, చెవ్వాకులు నమ్మునంగళ్లదగ్గఱ మూఁగియుండిరి. ఇట్లు వచ్చినవారు దేవాలయము లోనికిం బోవఁ జోటీయక తమ రెందులకు వచ్చినదియైన నాలోచింపక ప్రొద్దుపుచ్చుచుండిరి. శ్రీనివాసదాసు కష్టముమీఁద వీరినందఱిని దాఁటి దేవాలయమును బ్రవేశించెను. లోపల జనబాహుళ్యములేక హాయిగా నుండెను. గోపురమువఱకు మనుష్యారణ్యము గలదుకాని లోపల నేకష్టములేక భగవతిని దర్శింపననువుగా నుండెను. పామరులకాలక్షేపమునకు దాసు వెఱగందెను. యాత్రావ్యాజమున నెందఱు క్షుద్రకార్యము లొనరించుచున్నవారని చింతించెను. అభ్యంతరమును బ్రవేశించి యందు నిలుచుండి వచ్చుచున్న నవయువతులం జూచుచు భగవతిని సేవించుచున్నజాడ నభినయించు దుష్టమతులం గాంచి గర్హించెను. యాత్రలకై వనితలం బంపరాదన్న నీతి యొంతయు సమంచితమని నిశ్చయించెను. ద్రవ్యార్జనమే

ప్రధానముగాఁ గలయర్చకుల కపటభక్త్యభినయమును దూషించెను. ఇట్టులాచోటునఁగల దురాచారముల కేవ గించుచుం బోయి జగన్మాతను జాలంధరీనామధారిణిని దర్శించెను.

ఆదేవి భయంకరాకృతిం గానంబడును. కాని భక్తులకు మనోహరరూపిణిగనే కనఁబడును. ఒక్కకరమునఁ బాశాయుధము కలదు. దేవిని సేవించువారికి యమపాశ భయము లేదనునర్థము నాచిహ్నమే తెలుపును. మఱియొక్క హస్తమున నంకుశము కలదు. ఆయది దుర్మార్గముల విశృంఖల వృత్తిం జరించువారి నడంచుననుభావమును వెల్లడించును. ఇంకొకబాహువునందుఁ బుష్పబాణము వెలయును. అయ్యది పరదేవి నాశ్రయించువారలకుఁ గష్టములు సులభముగాఁ గడచిపోవునను నభిప్రాయమును దేటపఱచును. మఱియు నొక్కకేలఁ బుండ్రేక్షుచాపము దృగ్గోచరం బగును. అది భగవతి నెల్లకాలము భజించువారలకుఁ గష్టములే కలుగక మనోహరముగాఁ గాలముసాగునను నుదంతమును దెల్లముగఁ జేయును. ఇట్టులున్న యాదేవీవిగ్రహమును జక్కఁగా దర్శించి పరమానందమునఁ జేతులుమోడ్చి నమస్కరించి నిలువంబడి సహస్రనామములఁ బారాయణము చేసి ధ్యానించెను. అర్చకులు నామహాత్ముని గాంచినంతనే మనోవృత్తులు మార్పు నొందభక్తిమై నర్చించి పాదోదకము నొసంగి ప్రసాదమిచ్చి తమకృత్యమును నెఱవేర్చిరి. దాసు వారి కుచితధన మొసంగి ప్రసాదమును శిరసావహించి యించుక కూరుచుండునాచార ముండుటం

బట్టి యందే కూరుచుండి దేవీమాహాత్మ్యమును స్మరించు చుండెను.

శ్రీవత్సాంకదాసు భార్యాపుత్రులు వెంటరాఁగా జాలంధరీదేవీదర్శనార్థ మరిగెను. ఆదేవాలయమున నీదాసుగారికిఁ గొన్ని మర్యాదలు గలవు. గోపురము చేరఁగనే దేవిపూజ గావించిన పూలహారమును దెచ్చి యర్చకులు మెడలో వైచి పిలుచుకొని పోవునాచారముండెను. ఆవాడుక ప్రకారమర్చకులువచ్చి గారవించి పిలుచుకొనిపోయిరి. ప్రదక్షిణత్రయ మొనరించి లోపలఁ బ్రవేశించి పరదేవిని దర్శించి యర్చకులచేఁ బూజ గావింపఁజేసి పాదప్రసూనములఁ గైకొని మరలివచ్చుచు శ్రీనివాసదాసు నెవ్వరో తెలుపఁగాఁ జిరకాలసందర్శనజనితసౌహార్దమునఁ బరస్పరాలింగనాదిదేశాచారముల నడపి యందే యిరువురును గూరుచుండిరి. కుశలవార్తలఁ బ్రశ్నించిన వెనుకఁ దన కుమారుఁ డీతఁడని శ్రీవత్సాంకదాసు తెలిపెను. శ్రీనివాసదాసు ప్రమోదసంభరితమానసుఁడై యేవేవో విషయములఁ బ్రశ్నించి వివాహవిషయమును గూడఁ బ్రశ్నించెను. తనపుత్త్రునకుఁ దగినకన్యక దొరకినఁ ద్వరగా వివాహముచేయనున్నాఁడనని కృష్ణదాసుతండ్రి తెలిపెను. వారిచెంతనున్న పెద్దలు కొందఱు రాధికాగుణగణములను విద్యావైశద్యమును జేర్కొని యామె శ్రీకృష్ణదాసునకుఁ దగినకన్యక యనియు నామెకు నీవరుఁడు తగినవాఁడనియుఁ దెలిపిరి. పెద్దలయాశయము ఫలింపకపోవునా యని శ్రీనివాసదా సనియెను. మాయాశయ మీ కన్యావరులకు దాంపత్యము శుభదాయక మని యాఁపెద్దలు తెల్పిరి. అందొక రీవిషయము రామదాసుగారి నడిగిన మే లనిరి.

వారిదర్శనము నే యాశించుచున్నాఁడనని శ్రీనివాసదాసనియెను. మనయింటి కడనే వారిప్పుడు వేంచేసియున్నవారనియుఁ దప్పక మన యింటికి మీరు రావలయునని యు శ్రీవత్సాంకదాసు ప్రార్థించెను. మీరింతగా ప్రార్థింపవలయునా తప్పక వచ్చెదనని శ్రీనివాసదాసు బదులు చెప్పెను. "శుభమస్తు" అని పెద్దలనిరి. అప్పుడే తరలి యందఱు శ్రీవత్సాంకదాసుగారింటికిం బోయిరి.

వీరిరాక నెఱింగి యందులకే రామదాసు వేచియుండెను. గృహమును బ్రవేశించునపుడు శుభశకునము లెన్నియో కనఁబడెను. వియ్యంకు లిరువురును సంతసించుచుండిరి. అంగణమునందే దాసుగారు కూరుచుండియుండిరి. కాన వారిం జూడఁగనే శ్రీనివాసదాసుత్తరీయమును నడుమున బిగించి నమస్కరించెను. యోగి యాశీర్వదించి యందఱిఁ గూరుచుండ నియోగించెను కుశలప్రశ్న మొనరించి రాధికయారోగ్యమును బలుమాఱు లడిగెను. పెద్దలందఱు దేవీసన్నిధిని సాగిన వార్తను దెల్పిరి. రామదాసు నవ్వుచు నీదాంపత్యము సృష్టికర్తను బరిక్షింప నున్నది ఈ యిరువురకే దాంపత్యము కుదురనిచో సృష్టికర్త యసమర్థుఁడే యగును అనెను. వృద్ధులందఱు కరతాళధ్వను లొనరించి తమసమ్మతమును దెల్పిరి. ఈ విషయము రామదాసుగారి యిష్టానుసారము జరగకమానదని శ్రీనివాసదాసనెను. నాకుఁ బరమసంతోషముగా నున్నది. తప్పక యీవివాహము సాగవలయును. వారి నాశీర్వదించి నేనెచ్చటికో పోయెదను. అందులకే యిపుడు నిలిచితినని రామదాసనియె. శ్రీవత్సాంకదాసును సాధ్వియగు పద్మావతియు

మహానందమున యోగీశ్వరులయాజ్ఞ యమోఘము కావున సమ్మతించితి మనిరి. తన సంపూర్ణప్రీతిని శ్రీనివాసదాసును వెలి పుచ్చెను. పెద్దల "తథాస్తు" అను శబ్దములు సాంద్రము లయ్యెను. సుముహూర్తము నిశ్చయింప రామదాసుగారే సమర్థులని యందలివా రనిరి. ఆమీఁద నీవివాహమున కెన్నియోకారణములు గలవు సుముహూర్తము దైవికముగా నిర్ణయింపఁబడును. ఎవ్వరిప్రయత్నమున వా రుండవలయునని రామదాసు పలికెను. యోగదృష్టిగల దాసుమాటల కెల్లరు నాశ్చర్యంపడి యట్లే కావలయు ననిరి. ఆదినము శ్రీనివాస దాసు రామదాసుగారింగూడి శ్రీవత్సాంకదాసగృహమున నుం డెను. రాత్రి భోజనానంతరము రామదాసు శ్రీనివాసదాసు నేకాంతమునఁ జేరి యిట్లు పలికెను.

వత్సా! రాధిక సామాన్యకన్యకగా భావింపఁదగదు. పరమేశ్వరితేజ స్సాకన్యకయందుఁ గలదు. శ్రీ కృష్ణదాసు కూడ భగవదంశము గలవాఁడు. వీరిరువురవివాహమున మీ రెండువంశములు జగద్విఖ్యాతిం గాంచఁగలవు. కాని కొన్ని యంతరాయములు పొడసూపును. దేవాంశసంభూతుల విష యముననే యవి పెలుచన సాగుచుండును. రాక్షసాంశసం భూతులు పెక్కండ్రుందురు. వారు దేవతాంశము గల వారలం గాంచి యోర్వఁజాలరు. వారు చేయుదుండగములు తొలుదొలుత ఫలించినట్లు గానిపించి తుదకు నిష్ఫలము లగును. ఈవిషయమున నింతకంటెఁ జెప్పఁదగదు. ఈవాక్య ములు సూత్రప్రాయములుగా భావించి కార్యనిర్వహణము నకుం బూనవలయును. ఈవాక్కులయర్థమెల్ల ముందు మీకే

యనుభవమునుబట్టి స్పష్టముగా గోచరించును. మీరు త్వరగా నగరమున కరిగి నాయీవాక్యములను స్మరించుచు నిశ్చింతముగా ధైర్యము విడనాడక ప్రయత్నము సాగింపుడు.

అని రామదాసుపలుకఁగా శ్రీనివాసదాసు వినివిని యంత శార్థమును జక్కఁగా గ్రహింపఁజాలక యేవో కొన్ని విఘ్నములు గలిగినను వివాహము నెఱవేఱునన్న సారమును మాత్రము గ్రహించి యారేయి సుఖనిద్రచేసి మఱుదినము దాసుగారియనుమతిచే నందే గడపి సాయంకాలమున నగరము నకుఁ బయనము సాగించెను. శ్రీవత్సాంకదాసు వివాహవిషయమై మాటలాడి ముహూర్తము నిశ్చయించి దాసుగా రెపుడు చెప్పుదురో యావార్త మీకుం దెలుపుదుననియు సర్వ ప్రయత్నములు చేయవలయుననియుఁ జెప్పి సాగనంపెను. ఇరువురు విడిపోవలసివచ్చెను గదా యనుచింతఁ బూనఁదగిన వారైరి ఎంతోకష్టమునఁ బరస్పరము విడిపోయిరి. ఔరా! స్నేహమెంత బలవత్తరము! ఆపఱకు వా రిరువు రొక్కసారి యేని చూడనివారైన నొక్కదినము కలిసియుండినందున నిర్మల చిత్తులు గాన మరల విడిపోవవలసివచ్చెనే యనువిచారము నొందవలసినవా రైరి. స్నేహమునంటిపదార్థ మీలోకమున నేదియు లే దని పెద్దలు పలుకుమాట నిశ్చయ మని యీకథ సిద్ధాంతము చేయుచున్నది.

పాతాళుఁడు విలాసధామనగరమున నేమి చేసెనో యించుక విచారింతము. సప్తమీశుక్రవారము వచ్చెను. కృష్ణపక్షము గాన రాత్రి పదునాల్గుగడియల కించుమించుగాఁ జంద్రోదయ మగును. నాఁటియుదయమే తనప్రయత్నమం

తయు సంసిద్ధముగ నుండుటెఱింగెను. కుంతలుఁడు వివాహోచితపదార్థములం దేసికొనిపోవ సిద్ధముగ నుండెను. తక్కినపరివారము యథాసంకేతముగ నుండిరి తొలిదినమే భరతపురమునకుం బోయి కుంతలుఁడు ప్రయత్నమంతయు సిద్ధమయ్యెనని యర్చకులకుం జెప్పి సాయంకాలమే పూజాదులు ముగించి మీరిండ్లకుం బోవలయునని చెప్పివచ్చెను. నాలుగుడబ్బుల కాశించి వా రట్లు చేయఁబూని యుండిరి. శిబిక సంసిద్ధమయ్యెను. సంకేతస్థలములన్నియు నాయాయి సేవకులకుఁ జూపఁబడియెను. వారంద ఱాసమయమునకు వచ్చి సిద్ధముగనుందుమని పల్కిరి. తనకు వలయువస్తువులు మూలికలు సంసిద్ధముగనుండఁ బాతాళుఁడు కార్యభారవ్యగ్రమనస్కుఁడై యుండెను. ఎపుడు సాయంకాలమగునా యని వేచియుండెను.

ఆనాఁడు రాధిక శుక్రవారమగుట నభ్యంగస్నానమొనరించి పూజాదు లొనర్చి యిష్టదైవముల నారాధించి ముత్తైదువులకు వాడుకచొప్పున నిచ్చుదానముల నిచ్చి, సాయంకాలమునకు ముందే మరల సువాసినులు రాఁగా వారిం గూడి దేవీభజనముచేసి వీణానాదమున నంబను సువాసినీ బృందమును సంతోషింపఁ జేసెను. ఆనాఁడు విశేషించి శ్రమపడియెను. తల్లి రాధికా! ఏల యింత పాటుపడియెదవు? నేఁ డేమి విశేషమని ప్రశ్నించెను. రాధిక తల్లీ! నాతండ్రిగారు జాలంధరిదేవ్యుత్సవమునకుం బోయిరికదా. నేఁ డందు మహోత్సవము సాగును. శుక్రవారమౌట మఱింతవిశేషముగ నర్చనలు సాగును. కావున వారందు భక్తిపరవశులై యుంబ

నారాధింతురు. నేను నిందుండియే యాదేవి నారాధింపఁ దలంచితిని. భక్తపరాధీనమానసగదా లోకజనని. ఈవారమునఁ గల విశేష మద్దియే అనఁగా నామెయు నామాటలు మదికి సరిపడి యుండుటంబట్టి మంచిదమ్మా యని కూఁతుచర్యలకు మహానంద మున మునుంగుచు లోలోన నీకన్యక భగవత్యంశసంభూతురాలే యని నిశ్చయించుకొనియెను. ఆనాఁడు దైవవశమునఁ గాఁబోలు రాధిక యుదయాదిగా సాయంకాలముదనుక క్షణమైన నూరకుండక యేదోయొక కార్యపరత దేహమును శ్రమ పెట్టెను. సాయంకాలము కాఁగాఁ దనపనులన్నియుఁ దీర్చుకొని భగవతివిగ్రహమున కెదుటనే భూమిఁ బరుండెను. చెలికత్తెలు దాసికలు నించుకదూరముగా శయనించిరి. ఆగదితలుపు తెఱచియే యుంచిరి. కాన రాధిక వారికిఁ గనఁబడుచునే యుండెను. దీపము వెలుఁగుచునే యుండెను. ఆప్రక్కగదిలో నిందిరాదేవి శయనించెను. నాఁడు పెందలకడ శయనించిరి. కారణము పగటివేళ విశేషించి రాధిక పాటుపడుటయే కాని వేఱొండు కాదు. శయనించినవెంటనే యందఱకు గాఢనిద్ర పట్టెను.

ఆగృహ మత్యున్నతము. విశాలభాగము నాక్రమించి నదియు నగు. దానికిం బశ్చిమభాగమునఁ బూలతోఁట గలదు. అది యింటినంటియే యుండును. దానిప్రక్కన నెత్తైన ప్రాకారము గలదు. ఆప్రాకారమునకుఁ జెంత మఱ్ఱిచెట్టు గలదు. దానికొమ్మలు కొన్ని యాపూలతోఁటలోనికి సాగినవి కలవు. ఊడలు దిగ నది యొక మొదలుగాఁ దోఁచునట్లు నాలుగైదు కొమ్మ లుండెను. ఆతోఁటకు నంబావిగ్రహము గలగదికి దూర

మెంతయో లేదు. ఆపూలతావు లాగదిలో వ్యాపింపవలయు
ననియే మొదటనచ్చట నది గట్టఁబడియె. ఆగదికిఁ దూర్పుభాగ
మున మఱియొకగది కలదు. అదియే భోజనశాల యనంబడు.
దేవికి నైవేద్యముపెట్టి భుజించుట వారియింటఁ గలవాడుక.
ఆభోజనశాలకు నానుకొని యుత్తరభాగమున వంటచేయు
భాగము. దేవీగృహమునకు దక్షిణభాగముననే యిందిరాదేవి
శయనించియున్నగది కలదు. భగవతియుండు గదికి నుత్తరభాగ
మునఁ బాకగృహమునకుఁ బడమరగను గది యొకటి కలదు.
అందుఁ బారాయణపుస్తకములు పూజాద్రవ్యము లుండును.
అందే శ్రీనివాసదాసు దేవీగ్రంథములం జదువుకొనఁ గూరుచుం
డును. ఆనాఁడు శుక్రవారము గావునను దండ్రి జాలంధరీదేవీ
పూజాతత్పరుఁడై యుండుననియు రాధిక దేవీసన్నిధానముననే
పరుండెను.

పాతాళుఁడు తనపూన్కి నెఱవేర్పఁబూని పెందలకడ
భుజించి కుంతలు నింటికింబోయి సంకేతస్థలమునకు రమ్మని
హెచ్చరించెను. ఆసంజవేళనే యిరువురు మనుష్యులు సురా
భాండముల నెత్తుకొని తనయింటి వెనుకప్రక్కన నిలుచుండి
పిలిచిరనియుఁ దలుపుదీసి సందులోనుండుఁడని చెప్పితిననియు
మఱి కొలఁదిక్షణములకే తొమ్మండ్రు వ్యాధులు వచ్చిరనియు,
వారా సురను దృప్తిగాఁ గ్రోలిరనియు వా రన్నము తిని
వచ్చితిమని చెప్పిరనియుఁ దాంబూలము మాత్ర మిచ్చితిననియు
వారందే యున్నవారనియు నింకను జాము రాత్రి కాలేదనియుఁ
గాఁగానే పిలుచుకొని వత్తుననియుఁ గుంతలుఁడు దెలిపెను.
ఏవో కొన్నిమాటలు రహస్యముగాఁ దెలిపి పాతాళుఁడు

కొన్నివస్తువులు గలసంచి నొకదానిం దీసికొని వెడలి పోయెను.

పాతాళుఁన కాయింట నొకదాసిక రహస్యములు తెలుపుచుండునది కలదు. అది యొక్కతుకయే యాయింటికిం గలమర్యాద నడంచునది. అది నీచమతి. పాతాళునియింటికిం జెంత నాదాసికగృహము గలదు. మంచిమాటలాడుచు దానినెట్లో వశపఱచుకొనియెను. రాధిక శయనింపఁగనే యాజాడ నాదాసి యెట్లో పాతాళున కెఱిఁగించెను. అది వారియింటఁ బరుండునది కాదు. తనపనులన్నియు ముగించి యది వెడలిపోయెను. జామురాత్రి కాఁగానే పాతాళుఁ డామఱ్ఱివృక్షము నెక్కి తోఁటలో దిగియెను. దాసి యెఱింగించిన ప్రకారమే తలుపు చక్కఁగా వేయఁబడక యుండెను. కాన దానిం దీసికొనివచ్చెను. దీపములు వెలుఁగుచుండెను. ఆతఁ డాదీపములం దొకపసరు పిండెను. వానికాంతి ప్రసరించిన చోటుల శయనించియున్నవారెల్లఁ జూచుచున్నను మాట లాడఁ జాలరు. ఆపసరునం దట్టిశక్తి కలదఁట. ఆవెంట నిందిరాదేవి శయనించియున్న గదిని దాఁటి దానిముందు శయనించియున్న పరిచారికలం గాంచుచు దేవియుండు గదిలోనికిం బోయెను. రాధిక మెత్తనిచర్మముపై శయనించియుండెను. దేవికి నమస్కరించి యారాధికనుదుట నొక్క తిలకము పెట్టెను. దాన నామెకు స్మృతితప్పునని యాతఁ డెఱుంగును. నాసికారంధ్రముల నొక్కమూలిక వాసనఁ జూపెను. దానిచే నామెకు వాగ్బంధ మగును. ఈరెండింటిలో నొక్కటియే యాతనిపనికిఁ జాలినను మఱింత దిట్టముగాఁ బనిచేయుకొఱ

కట్టు లొనరించెను. అంతకుముందే గాఢనిద్రలో నున్న రాధి కకు నీరెండు మందులు తోడ్పడి మఱింత గాఢనిద్రం బట్టం జేసెను. అంత నాతం డామెను బొరలించెను. శవముచంద మున నామె యుండెను. తనశక్తి పనిచేసెఁగదా యని యానం దించెను. తలుపుతీసెను. దేవికి నమస్కరించెను. బలశాలిగాన నవలీల రాధికనెత్తుకొని యాపూలతోఁటనుండి పడమరకుం బోయెను. ఒకయీల వేసెను. వెంటనే కుంతలుని గూడి శిబికఁ గొనివచ్చిన తొమ్మండ్రు నవ్వల నున్నందున నందు నలువురు మఱ్ఱికొమ్మనుండి యీవలికి దిగిరి. నలుగురు పైనుండిరి. ఒక తొట్లి దింపఁబడియె. అం దారాధికను బరుండఁబెట్టి పైవారికి సంజ్ఞచేయ వా రాతొట్లి నీడ్చుకొనిరి. మెల్ల మెల్లగాఁ గొమ్మ వెంటఁ బదిలముగాఁ గొనిపోయి నలువురు దిగఁగా మరల నా తొట్లిను దిగవిడిచిరి. క్రిందనున్న వా రందుకొనిరి. శిబికలోఁ బరుండఁబెట్టిరి. కుంతలున కొక్క సేవకుని తోడిచ్చి ముందు పంపి యెనమండ్రు వ్యాధులు తాను బయనము సాగించిరి. నిశ్శబ్దముగా వారు నడచిరి. ఆనాఁ డానగరమున వింతనాటక మొకటి యాడఁబడుచుండెను. పెక్కం డ్రందులకుఁ బోయి యుండిరి. సందుగొందులంబడి యెట్లో నగరమును దాఁటిరి. ఆనగరమునుండి ధనవంతులు శిబికల నధిరోహించి ప్రయా ణముసాగించు టాచారమైనందున నిదెవ్వరిదో యని యెవ్వరైనఁ జూచినను బ్రశ్నించుటగాని యనుమానపడి నిలుపుటగాని చేయరైరి

విలాసధామమును దాఁటి పల్లకి యవ్వలఁ బయనము సాగించెను. చంద్రోదయమునకు నించుకముందే యాశిబిక

దేవాలయముకడకుం జేరఁగల్గెను. నాలుగుగడియల రాత్రికి ముందే యర్చకులు పూజచేసి యిండ్లకుం బోయి శయనించి నట్లుండి రెండవజామున నిర్వురు వచ్చి యాలయముకడ వేచి యుండిరి. ఆలయము చుట్టుపట్టుల నత్యున్నతవృక్షములు గలవు. కాన గాఢాంధకారముగనే వెన్నెలరాత్రులయందు నుండును. ఇఁక నానాఁడు చెప్పవలసినదేమి ? దైవవశమున నాకసమున మబ్బు క్రమ్మియు నుండెను. అర్చకులు తొలుతఁ గుంతలుంగాంచి వార్తల నెఱింగి సంతోషమున వారిరాకకై వేచియుండిరి. శిబిక యాలయమునకు నించుక దవ్వున నునిచి పాతాళుఁడు నిర్వురువ్యాధులు నరుదెంచిరి. అర్చకులం గలిసి కొనిరి. ఆవ్యాధులయం దొక్కనికా తొలిదిన మాశౌచము వచ్చెను. వానికిం దక్కినవారిలోఁ బెక్కండ్రు జ్ఞాతులు. ఇర్వురు మాత్రము బంధువులు. ఆశౌచముగలవా రాయాలయము లోనికిం బోయిన మరణము సంభవించునని ప్రవాదము కలదు. ఆయనుమాన మావ్యాధులకు మెండు. కావున వారు లోపలికి రాఁజాలమనిరి. కుంతలుఁడు, అర్చకులిరువురు వ్యాధు లిర్వురు పాతాళుఁడును గలిసి యాఱుగు రాశిబికఁగొని దేవా లయములోఁ బ్రవేశించిరి.

చంద్రోదయ మయ్యెను. కాని తన్నిర్మలకాంతులు సర్వత్ర వ్యాపింపనీయక మేఘము లావరించి యుండెను. వృక్షచ్ఛాయలు మఱింతగ నంధకారమును బెంపొందించెను. వ్యాధు లేడుగురు వెలుపల నుండిరి. పెండ్లికొడుకు పురోహితుఁడు గాక నలువురు లోన నుండిరి. రాధిక విస్మృతిమై నుండెను. ముఖకాంతి యొక్కింత వాడియుండెను. వేసిన

చేయి వేసినట్లే యుండెను. కుంతలుఁ డభ్యంగస్నానము చేయింపవలదా యని ప్రశ్నింప దొంగపెండ్లికి మంత్రస్నానమే చాలునని యర్చకమహాశయులు బదులిడిరి. కుంతలుఁ డంగీకరించెను. భవానికెదుట శిబికఁ జేర్చిరి. దేవికడనున్న పీటలం దెచ్చి యచ్చోట నర్చకు లమరించిరి. అగ్నిహోత్రుని సిద్ధము చేయుచుండిరి. కుంతలుఁ డింకఁ బెండ్లి సాగింతును. రాధికను మేలుకొలుపుమని పాతాళునకుం దెల్పెను. నీవన్నియు సిద్ధముచేసికొని యగ్నినిటనుంచిన యుత్తరక్షణమున మేలుకొనునట్లు చేసెదనని పాతాళుఁ డనెను. అర్చకులు పాతాళా! వివాహ మగును. తర్వాత నెందుఁ బోవయత్నమని యడిగిరి. వివాహానంతర మీయూరనుండ వలనుపడదుగాన నీచెంతనున్న కొండదరిఁ గొలఁదిదినము లుందును. అందొకపల్లియ గలదు. అందు శబరులు పెక్కండ్రు నాశిష్యులు గలరు. వారిచెంతనున్న నన్నుఁదెరిచూడ నిర్జరులకే శక్యంబుగాదు. ఎట్లో పదాఱుదినములు గడపెదను. ఆవల నీయూరికి వచ్చి దంపతులము దేవీపరిసరమున నుందుము. ఇంతలో నీ రాధిక నాకు లోఁబడును. ఆవల వివాహమును ద్రోసివేయఁ దరముగాదు. పుత్త్రికాప్రేమమున నన్నేమియు ననఁజాలక యల్లునిగ మామ గారవించును. అప్పుడే నాదెబ్బ మిమ్మెల్ల గారవింతునని యింకనేమో మాటలాడుచుండెను. వారు నిదంతయు యథార్థముగా సాగుననియే తలంచిరి. ఎంతటి మంత్రవేత్త గాకయున్న నిట్లు రాధికను స్మృతిలేక యుండఁజేసి యెవ్వరికిం దెలియరాకయుండ బహిరంగముగా శిబిక నెక్కించి తేఁగలఁడా యని వా రూహించి యాతని

ప్రతివాక్యము వేదవాక్కుగనే తలంచిరి. ఇంతలోఁ గుంతలుఁ డన్నియు సిద్ధములయ్యెననఁ బోయి వ్యర్థములయ్యెనని పలికెను. మహోత్సాహమున నున్న పాతాళున కామాట వినఁబడ దయ్యెను. ఇదిగో రాధికను లేపెదనని యేమో మంత్రించి ముక్కురంధ్రముల నేదియో మూలికను వాసనచూపి మోమున నున్న తిలకమును దుడిచి వేఱొకతిలకమును బెట్టి మూఁడు సారులు చిటికెలు వేసెను. నిద్రనుండి మేలుకొనినట్లు రాధిక లేచి కూరుచుండెను.

ఇపుడు రాధికయుండుచోటు కడుంగడుం గ్రొత్తది. భగవతి మాత్రము ముందుఁ గనఁబడును. ఆమెయు భీకర రూపమున నుండునదియే కాని రాధిక పూజించునంబ కాదు. రాధిక కూరుచుండి నలుదెసలఁ బరికించెను. పాతాళుఁ డగ పడెను. దేవాలయమునఁ దానున్నట్లు ఆలుగురు తన్నే మో చేయ నున్నయట్లు తోఁచెను. ఇదేమి వింతయని యామె విచారింపసాగెను తుద కిది పాతాళునిమోసమని తెలిసి కొనెను. పాతాళునిదుశ్చర్యల నామెయు వినియే యుండెను. ఇఁక నీలోకమునకుఁ దనకు ఋణముతీఱునని యామె తలంచెను. జననీజనకులం దలంచుకొని కన్నీరు కార్చెను. భగవతీ ! నిన్ను నమ్మినదాని నిట్లు చేయఁబూనితివి. ఇది నీకు న్యాయమా యని నిష్ఠురము లాడెను. తండ్రీ! నన్నే నమ్మియుంటివి. నీకు నావలని సాయము కల్గునన్న యాశ నశించెను. ఇఁక నాదుఃఖమే నిన్నుఁ గుందించును. నన్నుఁగన్న మీకిరువురకు నావలనఁ గలిగెడిలాభ మిదియే యని తలంచెదను. ఇఁక నేఁ జేయఁదగిన పనియేమని యూహించెను. ధర్మ మాపదలనుండి రక్షించునన్న నుడి వ్యర్థ.

మయ్యెఁగదా యని పరితపించెను. నిన్ను నమ్మినవారికిఁ జేటు కలుగదనిన పెద్దలమాటలు పొల్లులే కదా భగవతీ యని దూరెను. ఇఁక నీలోకమునకు నాకును దూరమగునని సిద్ధాంతము చేసికొనియెను. భగవతినే ధ్యానించుచుఁ జేతులు మునుళించి యూరకుండెను.

పాతాళుఁడు రాధికం గని కన్యకామణీ! యిది కాళికా దేవాలయము. కాని మీతండ్రియిల్లు గాదు. ఈ మాటలాడు వాఁడు పాతాళుఁడు. మీతల్లి యిందిరాదేవి నాకుఁదోఁబుట్టువు. కావున నీవు నాకు భార్యవగుదువు. ఈరాత్రి మంచి ముహూర్తము. భగవతి నాయిలువేలుపు. ఆమెసన్నిధిని సాగుకార్యములు సఫలము లగును. వేఱుమాటలాడి లాభములేదు. ఇఁక నీయాటలు సాగవు. నన్ను వరించి వివాహము సాగనిచ్చుటో లేక మఱియొకభావముఁ గనఁబఱచితివేని యీ కరవాలమున కాహుతివగుటయో నిశ్చయించుకొమ్ము. ఈ పాతాళుఁడు సామాన్యుఁడు కాఁడు నిన్ను నిద్రించుచుండ మంత్రబలమున నిటకుం దెచ్చినవాఁ డెవఁడు? ఈపాతాళుఁడే. ఆలోచించుకొమ్ము. నన్నుఁ జేపట్టిననే నీవు బ్రదుకుదువు. లేకున్న నీకంఠరక్తమునఁ గాళికాదేవికిఁ దర్పణము చేయుదును. ఇంక నాలస్యము లేదు. ముహూర్తము సమీపించుచున్నది. పురోహితులు త్వరపెట్టుచున్నారు. ఏమూలికాప్రభావమున నీవు స్మృతితప్పి యుంతదనుక నుంటివో యామూలికయే యిది. బలవంతముగనైనం బెండ్లియాడుదును. కాని యది నాకిష్టములేదు. వివాహమాడి వైహిక సుఖము లనుభవించుటొండె. నీకంఠమును దునిమి దేవికి బలి

యిచ్చి యాదేవీకరుణకుం బాత్రుఁడనై యాముష్మికసుఖము లొందుటొండె. ఈరెండుపనులలో నొక్కటి కావలయును. ఏమనియెదవు ? నీయిష్టానుసారము మెలంగువాఁడను గాను. ఇదిగో మంగళసూత్రము. ఇదిగో నిశితధారాకరాళమగు కరవాలము. ఈరెండింటిలో దేనిం గోరుదువు? త్వరగాఁ దెలుపుమని యదలించెను. కుంతలాదు లాకరవాలధారఁ గాంచి గడగడ వడంకిరి.

రాధిక నయనములు తెఱచి భగవతికి నమస్కరించి ధర్మమును నమ్మి భయముం బాఱఁద్రోలి యిఁక జీవితాశంగొని లాభము లేదని నిశ్చయించుకొని గంభీరోక్తుల నిట్లు పలికెను. పాతాళా ! ఈ మానవజన్మము పెక్కుపుణ్యములకుఁ బ్రతిఫలము. దీనిని మరలఁ బాపభూయిష్ఠముగఁ జేయరాదు. మానవహృదయము పవిత్రమైనది. దీని నపవిత్రముగాఁ జేయరాదు. అది మానవస్వభావమునకు విరుద్ధము. ఈతనువు గూడ స్థిరముగా నిలుచునది కాదు. నరహింసాదులు పౌరుషములు గావు. అవి నీచతమములు. ఈయోషధులు నీమంత్రములు ని న్నుద్ధరింపఁ జాలవు సరికదా. నీచాతి నీచగతికిం దీసికొనిపోవఁ గలవు. ఇది సత్యము. ఈకాళికాదేవి నా యిలువేలుపంటివి. ఈయొక్కమాటయే నీయజ్ఞానమును వెల్లడించుచున్నది. సకలలోకజనని కదా యీ పరదేవి. నీయిలువేల్పు మాత్ర మె ట్లగును? జగజ్జననికి నన్నాహారమిచ్చిన నాదేవి యీపుత్త్రికను బరిగ్రహించునా? ఈకార్యమున సంతోషించునా? నీచుఁడా! ఏలయందని ప్రాఁకుల కట్టుచూపెదవు? ఈకన్యక నీకు లభించునది కాదు. కరవాలమున నాహుతియే చేయుము. భగవతిసాన్నిధ్యమున నే యుండెద.

ఇఁక నన్ను మాటలాడింపకుము. నీయిచ్చవచ్చిన చొప్పునం జేయుము. అని ధ్యానము నాశ్రయించి నిమీలితనేత్రుఁడై పరదేవీపాదారవిందములం దలంచుచుండెను.

పాతాళుఁ డాపలుకులకు నాగ్రహించెను. నాచేతఁ జిక్కియుఁ గాఱులాడెదవా యని యదలించెను. నీకంఠముం ద్రెంచి రక్తధారల నంబాపాదారవిందములఁ బ్రక్షాళన మొనరింతును. రవంతసేపు తాళుమని భయపెట్టెను. ఏమో జపించినట్లు నటించెను. కాళికాసమీపమునకుం బోయి సాష్టాంగ నమస్కారముల నాచరించెను. లేచి కరములముకుళించి భగవతిని వినుతించెను. ఖడ్గము నామెపదనఖరములకుం దగిలించి యందుకొని జళిపించెను. జననీ! కన్యకారత్నకంఠలుంఠన మొనరించి వేఁడినెత్తురు సోనల నీకర్పించి కృతకృత్యుఁడ నయ్యెద. నాకరవాలముచివరన నిలిచియుండుమా యని యభ్యర్థించెను. ఒక్క దాఁటున వచ్చి రాధికాకాంత మ్రోల నిలువంబడియెను. విశేషించి యామెను బలుకరింపక యేమోగొణుగుకొనుచుండెను. అర్చకుల కిరువురకుఁ బాదములు మొదలుకొని యుత్తమాంగమువఱకు వడఁకసాగెను. ఏమో యుపద్రవము రానున్నది. మనమేల యీ వెంటలో దిగితిమిరా స్వామీయని చింతింపసాగిరి. కరవాలమున కాహుతికాసీయక మన మాపవలయునని యూహించిరి. కాని యాతని భీషణాకారమును గాంచి మనకే యాపని యగునేమో యని యనుమానింపసాగిరి. కుంతలుఁడు వడఁకుచు నేనేల యీక్రూరుని మాటలవింటినని పలుభంగుల విచారింపసాగెను. ఏది యేమైనను గన్యకప్రాణముల దక్కింపవలయునని నిశ్చ

యించెను. వ్యాధులిద్దఱు బదులాడక దూరముగాఁ గూరు చుండి యుండిరి. కొంతసేపిట్లు గొణిగి గొణిగి రాధికా! ఇది కడ సారిమాట. ఏమందువు? అని యదలించెను. ఖడ్గమును జళి పించెను. పొడుగఱచి కత్తినాడించెను. అది కుక్కనాలుకవలె నల్లల నాడుచుండెను. ఒక్కవ్రేటున కెందళికంఠములనైన దునుమఁగలధార దానికిం గలదనుట నిక్కము. రాధిక పలుక లేదు. తల్లిదండ్రులం దలంచుకొని యిఁకేటి జనకులని వదలి భగవతి ధ్యానించి యెట్టికష్టములనైనఁ దొలఁగింతువని నమ్మి తిని. నీదయ అని వినుతించుచుండెను. అంతఁ బాతాళుఁడు కరవాలాగ్రమును రాధికాకంఠమునకుఁ దగులఁజేసి యిదె మఱియొకసారి హెచ్చరించుచున్నవాఁడ. ఏమందువు? నన్ను వరింతువా. ఖడ్గధారకు బలియగుదువా యని బెదరించెను. బదులు లేదు. మూఁడుసారులు కత్తిని దనచుట్టును ద్రిప్పెను. కాళికా! ఇవె కన్యాకంఠరక్తధారలు. తనివిదీఱఁ గ్రోలుమా యని కత్తి మరల జళిపించెను. వానిమోము చూడఁ దరము గాక యుండెను. అర్చకు లిరువు రుత్తరీయముల నడుములకు బిగించి నిలువఁబడిరి కుంతలుఁడు దర్భగ్రంథి యవలఁ బాఱవైచి చేతికట్టునూని నిలుచుండెను. కత్తియెత్తగనే యడ్డుపడవలయు నని యాతనియూహ. పాతాళుఁ డంబకు నమస్కరించి సెలవా జననీ! యని యడిగెను.

ఇంక సెలవే లెమ్ము. పాతాళా క్రూరమానసా! సెలవే. అను కరాళాట్టహాసయుతవాక్కు లెందుండియో వినఁబడి యెను. అర్చకులు కుంతలుఁడు నులికిపడి నలుదిక్కులకు దృష్టులఁ బ్రసరింపసాగిరి. అంతలో వేంకటేశ్వరుఁడు దేవి పృష్ఠ

ఇఁక నన్ను మాటలాడింపకుము. నీయిచ్చవచ్చిన చొప్పునం జేయుము. అని ధ్యానము నాశ్రయించి నిమీలితనేత్రయై పరదేవీపాదారవిందములం దలంచుచుండెను.

పాతాళుఁడాపలుకులకు నాగ్రహించెను. నాచేతం జిక్కియుఁ గాఱులాడెదవా యని యదలించెను. నీకంఠముం ద్రెంచి రక్తధారల నంబాపాదారవిందములఁ బ్రక్షాళన మొనరింతును. రవంతసేపు తాళుమని భయపెట్టెను. ఏమో జపించినట్లు నటించెను. కాళికాసమీపమునకుం బోయి సాష్టాంగ నమస్కారముల నాచరించెను. లేచి కరములముకుళించి భగవతిని వినుతించెను. ఖడ్గము నామెపదనఖరములకుం దగిలించి యందుకొని జళిపించెను. జననీ! కన్యకారత్నకంఠలుంఠన మొనరించి వేఁడినెత్తురు సోనల నీకర్పించి కృతకృత్యుండ నయ్యెద. నాకరవాలముచివరన నిలిచియుండుమా యని యభ్యర్థించెను. ఒక్కదాఁటున వచ్చి రాధికాకాంతమ్రోల నిలువంబడియెను విశేషించి యామెను బలుకరింపక యేమోగొణుగుకొనుచుండెను. అర్చకుల కిరువురకుఁ బాదములు మొదలుకొని యుత్తమాంగమువఱకు వడఁకసాగెను. ఏమో యుపద్రవము రానున్నది. మనమేల యీ వెంటలో దిగితిమిరా స్వామీయని చింతింపసాగిరి. కరవాలమున కాహుతికానీయక మన మాపవలయునని యూహించిరి. కాని యాతని భీషణాకారమును గాంచి మనకే యాపని యగునేమో యని యనుమానింపసాగిరి. కుంతలుఁడు వడఁకుచు నేనేల యీక్రూరుని మాటలవింటినని పలుభంగుల విచారింపసాగెను. ఏదియేమైనను గన్యకప్రాణముల దక్కింపవలయునని నిశ్చ

యించెను. వ్యాధులిద్దఱు బదులాడక దూరముగాఁ గూరు చుండి యుండిరి. కొంతసేపిట్లు గొణిగి గొణిగి రాధికా! ఇది కడ సారిమాట. ఏమందువు? అని యదలించెను. ఖడ్గమును జళి పించెను. బొడుగఱచి కత్తినాడించెను. అది కుక్కనాలుకవలె నల్లల నాడుచుండెను. ఒక్కవ్రేటున కెందళికంఠములనైన దునుమఁగలధార దానికిం గలదనుట నిక్కము. రాధిక పలుక లేదు. తల్లిదండ్రులం దలంచుకొని యిఁకేటి జనకులని వదలి భగవతి ధ్యానించి యెట్టికష్టములనైనఁ దొలఁగింతువని నమ్మి తిని. నీదయ అని వినుతించుచుండెను. అంతఁ బాతాళుఁడు కరవాలాగ్రమును రాధికాకంఠమునకుఁ దగులఁజేసి యిదె మఱియొకసారి హెచ్చరించుచున్నవాఁడ. ఏమందువు? నన్ను వరింతువా. ఖడ్గధారకు బలియగుదువా యని బెదరించెను. బదులు లేదు. మూఁడుసారులు కత్తిని దనచుట్టును ద్రిప్పెను. కాళికా! ఇవె కన్యాకంఠరక్తధారలు. తనివిదీఱఁ గ్రోలుమా యని కత్తి మరల జళిపించెను. వానిమోము చూడఁ దరము గాక యుండెను. అర్చకు లిరువు రుత్తరీయముల నడుములకు బిగించి నిలువఁబడిరి కుంతలుఁడు దర్భగ్రంధి యవలఁ బాఱవైచి చేతికట్టునూని నిలుచుండెను. కత్తియెత్తగనే యడ్డుపడవలయు నని యాతనియూహ. పాతాళుఁ డంబకు నమస్కరించి సెలవా జననీ! యని యడిగెను.

ఇంక సెలవే లెమ్ము. పాతాళా క్రూరమానసా! సెలవే. అను కరాళాట్టహాసయుతవాక్కు లెందుండియో వినఁబడి యెను. అర్చకులు కుంతలుఁడు నులికిపడి నలుదిక్కులకు దృష్టులఁ బ్రసరింపసాగిరి. అంతలో వేంకటేశ్వరుఁడు దేవి పృష్ఠ

భాగమునుండి యొక్కయెత్తున దుమికెను. తళతళలాడు కర వాలములు వాని రెండుచేతుల మెఱయుచుండెను. అతనివెంటఁ గాళీచరణదాసుఁడు బలిష్ఠమగుదేహము కనంబడ ఖడ్గపాణియై వచ్చెను. రామకిశోరశర్మయు శ్యామసుందరుఁడు నుద్దండ ధ్వనుల నంబరమును బగులఁజేయుచుఁ బ్రాఖ్లుపట్టుకొని యా యుధపాణులై దక్షిణోత్తరభాగములనుండి చివాలున నట వ్రాలిరి. ఎత్తినకత్తి నట్లే తునుకలై పడఁ గాళీచరణదాసు తన ఖడ్గమునఁ గొట్టెను. వేంకటేశ్వరుఁ డొక్కెత్తునఁ బయింబడి సిగపట్టుకొని వంచి జానుఘాతముల మర్దించెను. రామకిశోర శర్మ వాని నాత్రాళ్లచే బంధించెను. పాప మాపాతాళుఁడు దిగ్భ్రమముచెంది యూరకయుండెను. అర్చకులిరువురు ప్రాణ ములపై నాశమాని యట్లే కూలఁబడిరి. కుంతలుఁడు స్మృతిదప్పి ముందే పడిపోయెను. వ్యాధులిర్వురు వారింగాంచి యేమో యనఁబోవునంతలో రామకిశోరశర్మయు శ్యామసుందరుఁడును జక్కఁగా మర్దించి కట్టివైచిరి. నోటినుండి మాటవెడలినఁ దల లెగిరిపోవు ననిరి వారేనాఁడో చచ్చిన ట్లూరకుండిరి.

వేంకటేశ్వరుఁడు సోదరీ! రాధికా! భయంపడకుము. వీఁడె పాతాళుఁడు బంధింపఁబడియె. మే మనంతాచలశర్మ శిష్యులము. నీదురవస్థ ముందే తెలిసికొని వచ్చితిమి. భయం పడక లెమ్మనిరి. పాప మారాధిక ప్రాణము లెందుండెనో యప్పుడు మరల దేహమునఁ బ్రవేశించెను. కన్నులు స్వాధీనము లయ్యెను. చూడఁగాఁ దమయింటి కపుడపుడు వచ్చుచున్న వారే యని స్మృతికిం దగిలిరి. ఆనలువురం గాంచినంతనే యామె దుఃఖ మాపుకొనలేక బోరున నేడువసాగెను. ఇంతలోఁ

గాళీచరణదాసు గోపురద్వారముల మూసివచ్చెను. ఇంక నెవ్వరును రాఁజాలరు. వారెంతయో రాధిక నోదార్చిరి. పాతాళునిం జూపిరి కుంతలు నర్లే బంధించిరి. అర్చకులిరువురు పాదాక్రాంతులైరి. వారిని గట్టివేయక కదలకయుండుఁడని హెచ్చరించిరి. వారు శవములవలె నుండిరి. ఈనల్వు రెపుడువచ్చి యందుండిరో యెఱుంగుట కష్టము. ఆవిషయము తెలిసికొనవలసినదే.

ఆనాఁడు సాయంకాలమున నల్వురును వేషాంతరముల దేవాలయముకడనుండు వృక్షములకడ నుండిరి దానిప్రక్కనే యొకమార్గము కలదు అదియే విలాసధామమునకుం బోవు పెద్ద బాట ఎందఱో పోవుచు వచ్చుచుందురు. అర్చకు లిరువురు సాయంకాలమే మహాద్వారము తెఱచి లోనఁ బ్రవేశించిరి. వారందే వంటచేయవలసిన ట్లాచారము కలదు. వంటచేయుచు నడుమనడుమ దేవతల కలంకారముఁగూర్చుచు మరల మహానస గృహమునకుం బోవుచు వచ్చుచుండుట యలవాటు. ఆరీతిగా నాఁడును సాగుచుండఁగా నిరువురు కాళికాదేవి వెనుకభాగమునఁ జేరిరి. తక్కినయిద్దరు మండపములు ప్రక్కలనున్నందున వాని చెంతనుండు వృక్షముల నెక్కి యాకుజొంపములఁ గూరుచుండి యుండిరి. ఆనాఁడు గాఢాంధకారము మేఘ మావరించుటం జేసి కలిగెను. వారుకనిపెట్టియుండి పాతాళుఁడు కత్తిఁ ద్రిప్పుచువచ్చి కంఠము తెగవ్రేయునని యూహించి యొక్కసారి వచ్చిరి. రాధికను గాపాడిరి. వీరిని బంధించిరి.

వేంకటేశ్వరుఁ డిఁకేమిచేయవలయునో తెల్పుఁడని తక్కినవారి నడిగెను. గురువునానతిమైఁ జేయవలయునని తక్కినవారు తెలిపిరి. అర్చకులంగాంచి మీరు ప్రాణముల దక్కించుకొనఁ దలంచినచో నెవ్వరెవ్వరు వచ్చినది తెలుపుఁడని యడిగిన వేంకటేశ్వరుం గాంచి వడంకుచు గోపురమునకు వెలుపల నేడుగురు వ్యాధు లున్నవారనియు వా రాశౌచభయమున లోనికి రారైరనియుఁ దెల్పిరి. మీ రిపుడు మేము చెప్పునట్లు చేయకయున్న నంబకు బలియిత్తునని యాతఁడు మరలఁ బలికెను. మీ రాజ్ఞ యిచ్చినట్లే చేయుదుమని వారు ప్రమాణము చేసిరి తక్కినవారితో నాలోచించి వేంకటేశ్వరుఁ డిట్లు పలికెను. మాశ్యామసుందరుఁడు మీతోడ వచ్చును. గ్రామమున కొక్కఁడే పోవలయును. ఒక్కఁ డిక్కడనే యుండవలయును. ఇరువురు మనుష్యులను బిలుచుకొని త్వరగా నగరమునకుం బోయి రాధికాకుశలవార్తఁ దల్లిలోనగువారికిం దెలిపిరావలయు. వా రగుదెంతురు గాన మీరు రేపురావచ్చును. మాశ్యామసుందరుఁడు నగరమునకు మీతోడనే వచ్చును. మీ రట్లుచేసిన మాకృపకుఁ బాత్రులగుదురు. లేనిచో నీనిస్త్రింశమునకు బలియగుదురు. అనఁగా వారట్లులే యొనరింతుమని బాసచేసిరి. నృసింహాస్వామ్యర్చకుఁడు శ్యామసుందరుంగూడి భరతపురమునకుం బోయి పెద్దలతో రహస్యముగా నాలెఁకఁ గెఱింగించి వారియనుమతిచే వచ్చిన మనుష్యులంగూడి కాఁగడలం గొని విలాసధామమునకుఁ బయనము చేసెను.

ఇక విలాసధామమున శ్రీనివాసదాసుగృహమున జరగిన వార్త లరయుదము. రాధికందీసికొని పాతాళుఁడు పోయిన పిమ్మట గృహమును రక్షింప నియుక్తుఁడై యున్న కాహళుఁడు రెండవయామము రాఁగా నరుదెంచి గంభీరస్వరంబున భటులం బిలిచెను. వార లప్రమత్తులై యుండిరి. ఇంచుక లోపలికిఁ బోయెను ఆఁడువారందఱు శవములభంగిఁ బడియుండిరి. కాహళుఁడు మరలఁ బిలిచెను. పలుకలేదు అచ్చెరువంది మరలఁ బిలిచెను. ప్రతిధ్వని రాలేదు. ఏమిది యని మఱికొంతలోపలికిం బోయెను. భోజనశాలలో నెల్లరు శయనించి గాఢనిద్రలో నున్న యట్లు కనఁబడఁగా మరల నందుండియే పిలిచెను. కదలక మెదలక వా రుండిరి. సేవకులంగూడి చెంతకుం బోయెను. ఒక్కరును మెలఁకువగలిగియున్న యట్లు తోఁపమిఁ జింతించి యిదియే మన్యాయమని తలంచెను. పరికించి చూడఁగాఁ బూజామందిరము తలుపు తెఱచియున్న ట్లగపడెను. ఏదో కృత్రిమము సాగినదని చింతించి సేవకులంబంపి తనమిత్రుని భార్యతోఁడ రప్పించెను

ఆదంపతులకు మూలికాపద్ధతులు క్షుద్రవిద్యావిశేషములు తెలియును. కావున నితరుల దుష్టకృత్యములు వారిని బాధింపఁజాలవు. ఆవిషయ మెఱింగియే కాహళుఁడు వారిని బిలిపించెను. దీపమునఁ బిండినపసరు దీపకాంతి వ్యాపించి నంతదూరము తనశక్తిఁ జూపఁజాలక కుడ్యముదనుకఁ జూపఁ గలదని యొక నియమముఁట. ఆవిషయమువెల్ల నాదంపతు లెఱుంగుదురు. కావుననే కాహళుని చెంతకువచ్చిన యతని మిత్రుఁడు భార్యను లోపలికిం బోయి కనుఁగొనుమని యాజ్ఞా

పించెను. ఆమె లోపలికింబోయి వారిని బొరలించి లేపినను బలుకకైరి. అదిగని కాహళుఁడు మిత్రమా యేమిది యని యడుగ నాతఁడును క్షుద్రవిద్యానిపుణుండు కాన దీపము లార్పవలయునన నట్లే చేసి క్రొత్తదీపముల వెలిఁగించెను. ఆదీపచ్ఛాయ వ్యాపింపఁగనే యంద ఱులికిపడి లేచిరి. కాహళుని గని భయంపడిరి. ఇందిరాదేవి యింకను మేల్కొనలేదే యని యాదీపము నార్పునట్లు చేయఁగా నామెయు మేలుకొనియె. ఎల్లరు రాధికామందిరమునకుం బోవ రాధిక యగపడదయ్యెను. తలుపు తెఱచియుండుటం గాంచిరి. ఇంతలోఁ బెక్కండ్రు పెద్దమనుష్యులు గూడిరి. నలుదెసలఁ బరికించిరి. పాదచిహ్నములు కనఁబడఁగా నిందు మనుష్యుల యడుగులగుఱుతు లున్నవనిరి. ప్రాకారమునకవ్వల మఱికొందఱ యడుగులజాడ లగపడఁగా విచారింపసాగిరి. ఇంతలో నెవ్వరో యాత్రోవనే యొకశిబిక నెత్తుకొని కొందఱు వారివెంటఁ గొందఱు పోయిరని తెల్పిరి. అప్పటి కొకజాము దాఁటినదని తెలియవచ్చెను. రెండవజాము దాఁటినగుఱుతుగా ఘంటానాదము వినంబడియెను. రాధిక నాత్రోవనే శిబికలోనునిచి యెత్తుకొనిపోయిరని నిర్ణయించిరి. ఎల్లరు నింతటి యన్యాయము సాగునా యని చేతులు పిసికికొన సాగిరి. ఇంద ఱుండియు నిట్లు జరగుటకు హేతువుండవలయునని మరల నింటికిం బోయి పరీక్షింపఁగా దీపతైలము వివర్ణముగా నుండెను. కృత్రిముఁ డెవ్వఁడో పసరు పిండి యెల్లరను మూర్ఛిల్లఁజేసెననియు, రాధిక నిల్లుదాఁటించి కొనిపోయెననియు నిశ్చయించిరి. ఇంతటి ఘోరకృత్యము చేయు నంతపగవారు కలరా యని విచారింపఁగాఁ బాతా

ళుఁడే రాధికం గోరియున్న వాఁ డనియు వాఁడు క్షుద్రవిద్యా పారంగతుండనియు నెవ్వరో చెప్పిరి. ఇందిరయు నగునని యంగీక రించెను. ఎల్లరును జింతాసాగరమున మునింగిరి.

రక్షకభటు లరుదెంచిరి. రాధిక నెత్తికొనిపోయినవాఁ డెవ్వఁడో చూపినఁ బట్టుకొందుమని వా రభయహస్తమిచ్చిరి. వానిపేరు, వాఁ డుండుతావును జూప నెవరినైనఁ బంపుఁడని వారు త్వరపెట్టసాగిరి. ఏత్రోవనుండి యింటిలోనికిం దిగెనో చూచినవారు కొందఱుండవలయు ననిరి వారు సాక్ష్యము చెప్పినమీఁద వాని దండితునిజేయుదుమని ప్రల్లదంబు లాడిరి. ఇన్ని గుఱుతులు చిక్కిన మేమే పట్టుకొనఁజాలమా యని కాహళుండనియెను. ఈసందడిలో మూఁడవజాము వెళ్లిన గుఱుతుగా గంట మ్రోఁగెను. నగరమునఁ గలవారెల్ల రాశ్చర్య పడసాగిరి. ఎందుఁజూచిన నీవార్తయే చెప్పుకొనసాగిరి. పాతా ళునికృత్యమే కాని వేఱొకరిపని యిదికాదని యెల్లరు నిర్ణయిం చిరి. అప్పుడే జాలంధరపురమున కంచెగుఱ్ఱముల నెక్కి సేవకు లరిగిరి.

ఆశుక్రవారము రాత్రియే భోజనానంతరము రామ దాసుతో మాటలాడి తెల్లవాఱుజామునఁ దదనుజ్ఞాతుఁడై విలాసధామమునకు శ్రీనివాసదాసు ప్రయాణమయ్యెనని యిం తకుముందే పాఠకమహాశయులు చదివియుందురు. జాలంధర పురసీమ దాఁటినప్పటినుండి యనేకదుశ్శకునములు కనఁబడ సాగెను. ఒకదానికంటె వేఱొకటి యమంగళదాయకముగా నాతనికిం దోఁచుచుండెను. ఒక్కచోఁ గూరుచుండి కొంత దూరము వెనుకకుం బోయి పాదప్రక్షాళనము చేసికొని యం

దొకవృక్షమూలమున నించుక శయనించి మరలఁ బ్రయాణము చేసెను. యథాపూర్వముగా దుశ్శకునములు కాసాగెను. భగవన్నామము జపించుచు సర్వానర్థపరిహర్త పరమేశ్వరుం డని నిశ్చయించుచు మరల దుశ్శకునములకు జంకియు మరల ధైర్యము తెచ్చుకొని వానిని లెక్కింపనట్లు ప్రయాణము జరపుచునే యుండెను. సూర్యోదయమై కొంత ప్రొద్దెక్కెను. వడివడిగా గుఱ్ఱములు నడచుచునే యుండెను. మధ్యాహ్నము కావచ్చెను. అపుడపుడు దుశ్శకునము లగుచునే యుండెను. ఎండకుబడలి యొక గ్రామమున సత్రమునకు ముందున్న తోఁటలో దిగి వంటచేయ నాజ్ఞాపించి తాను నాలోచించు చుండెను.

---

# ఐదవ వీచిక.

విలాసధామమున రాత్రి నాలవజామునఁ బ్రయాణమయిన యాత్రికులు చావుపర్వున వాని నడిపించుచు శ్రీనివాసదాసు భుజించి యింకఁ బ్రయాణము చేయుఁదమా యని యూహించు చుండ నచ్చటఁ జేరిరి. గుఱ్ఱములు నీరు త్రాగినపిదప నించుక సేపు సేదదీర్చుకొని ప్రయాణము సాగింతమని వారు సత్రముకడఁ జెట్లక్రింద నిలిచిరి. సేవకుఁడు బయటి కెందులకో వచ్చి వారిం గాంచెను. వారు నావార్త వానికిం జెల్పి వానింగూడి తోఁట లోనికిం బోయి దాసుగారికిఁ జెప్పలేక యావార్తం జెల్పిరి. శ్రీనివాసదాసు నిశ్చేష్టుఁడై రాధికాయనుచుఁ బడిపోయెను. శీతలోపచారము లొనరించి యెట్లో స్మృతివచ్చునట్లు చేసిరి.

కన్నీరు మున్నీరుగానుండ మాటలాడఁజాలక పయనము సాగించవా యనియెను ఈగుఱ్ఱము లలసినవి. ఆయాయితావుల నశ్వముల నునిచి వచ్చితిమని వారలనిరి. వీరి నందే నిలిపి యలసిన గుఱ్ఱముల నించుక సేదదీర్చి రేపు పయనముసాగింపుఁడని వారల కాజ్ఞాపించి తాను బ్రయాణముచేసెను. కొంతదూరము రాఁగా నందు గుఱ్ఱములు సిద్ధముగా నుండెను. వాని నెక్కి పరిజనులు దానును దారింబట్టి పోయి యిట్లే గుఱ్ఱముల మార్చుచు సాయంకాలము కాకమునుపే విలాసధామమును జేరెను.

ఇపుడు భరతపురవృత్తాంతము తెలుపకయున్నఁ గథ విశదముగాఁ దెలియదు. భరతపురమునుండి శ్యామసుందరుఁ డొక యర్చకుని మఱికొందఱనుగూడి కాఁగడలం గొని విలాసధామమునకుఁ బోయెను. చిటిపొటిచినుకులు వానికిందోడు మెఱపులు వానినిమించు గర్జితములు తమ్ముఁడ్డుచుండఁగా నెట్లో మూఁడవ జాము వెళ్లునప్పటికి నగరమును జేరెను. అత్యంతము పొడవు వెడలుపుగల యానగరమునఁ బోయిపోయి కాహళుఁడు జాలంధరపురమునకు నాశ్వికులంబంపిన యొక్కక్షణమునకు శ్రీనివాసదాసుగారియిల్లు చేరెను. శ్యామసుందరుఁ డందుఁ గలవారికెల్లం గ్రొత్తవాఁడు. ఐనను రాధికాకుశలమును దెలుప వచ్చితిమని గట్టిగాఁ బలుక నంద ఉలికిపడి యెవరో కనుఁగొనుఁడని పలుకుచు రండిరండి యని పిలువఁగా నందఱు లోనఁ బ్రవేశించిరి. ఇందిరాదేవి శవప్రాయముగాఁ బడియుండియు రాధికాకుశలమును దెలుప నెవ్వరోవచ్చిరనువార్త యమృతధారవలెశ్రుతివివరముల సోఁక నులికిపడి లేచెను. ఇంతలో శ్యామసుందరుఁడు తక్కిన

వారితో నామెకడకుం బోయి యిందిరాదేవీ! మీకుమారిక రాధిక భరతపురమునం గాళికాసన్నిధిని గుశలముగా నున్నది. ఈవార్తం దెలుపవచ్చితిమని హితవాక్కులు వినిపించిన నాల కించి మరలమరల నడిగి కాహళుం బిలిచి యీక్షణము భరత పురమునకుం బోవలయును. శిబిక నాయత్తపఱుపుమనంగా నందుం గల పెద్దలందఱు తల్లీ! నీవీసమయమున నచటికిం బోవుట పాడి గాదు. మే మందఱము పోయి తెల్లవాఱునంతదనుక నందుండి రాధికారక్షణమునం దప్రమత్తులమై పాతాళుని జూచుచుం దుము శ్రీనివాసదాసుగారు రాంగా వ్యవహార మెట్లు చేయం దగునో యట్లే జరపుదురు. మీ రిపుడు వెళ్లి రాధికం దీసికొని వచ్చిన వ్యవహారము తాఱుమాఱగును. తల్లీ! మామాటల నవధరింపుఁడు. త్వరపడకుఁడు. భగవంతుం డీబాలురరూపమున నాకుమారిని గాపాడెను. కావున నిఁక నారాధికకు నించుకంతయు భయము కలుగకయుండ మేమెల్ల నిపుడే పోయి కాపాడెదమని తెలియంజెప్పిరి.

ఇందిరాదేవి ధీమంతురాలు. పెద్దలవలన సకలధర్మముల నెఱింగినది. శీలవతులలో మేటియని పేరుగాంచినది కావున వారిమాటలు న్యాయసమ్మతములగుట నంగీకరించి వారిని బ్రార్థించి భరతపురమునకుం బంపెను. కాహళుఁడు గృహా రక్షణమునకై సోదరు నియోగించి భరతపురమునకుం జెక్కుం డ్రను బెద్దలను బంపి తాను జాలంధరపురమార్గమునం గొంత దూర మరిగి దాసుగారిరాకకై యెదురుచూచుచుండెను. ఇందిరాదేవి ప్రభాతము కాంగా లేచి స్నానముచేసి పర మేశ్వరిం బూజించి యిట్టియెడరు తప్పుట నీ యనుగ్రహమున నే

కదా యని ప్రార్థించి యాపాదతీర్థమును బుచ్చుకొని నిరశన వ్రతయై భర్తయాగమనమును బ్రతీక్షించుచుండెను నాలుగు గడియల కొక్కసారి భరతపురమునుండి సేవకులు గుఱ్ఱము లెక్కివచ్చుచు రాధికకుశలమును దెలుపుచుండిరి. శనివార ముదయమున రాధికయు నాలయముననే స్నానముచేసి తల్లిగా రంపిన వస్త్రములం దాల్చి భగవతిం బూజించి ప్రాణరక్షకు లగు వేంకటేశ్వర ప్రభృతు లొసంగిన యుపహారమునుం గొని జనకునిం జూడంగోరి కూరుచుండి తన ప్రియజనని కిట్లు లేఖ వ్రాసెను.

"ప్రియజననీ! రాత్రి యేమచ్చుమందుశక్తివలననో విస్మృతనై పడియుండి యీ కాళికాలయమున మేల్కాలుపఁ బడితిని. పాతాళుని కరవాలమునకు బలినౌదునని నిశ్చ యించుకొని మిమ్ములను గష్టపెట్టుదాన నైతిఁ గదా యని దుఃఖించుచు నవకాశ మొసఁగఁబడదని యాదురాత్ముఁడు హెచ్చ రించినందున నాతనిం బెండ్లియాడుటకంటె దేవీసాన్నిధ్యమున మరణించి మరల మీకుఁ బుత్త్రికనై పుట్టుటయే సముచితమని తలంచి ధ్యాననిష్ఠ నుంటిని. తమ యాశీర్వచనమహత్త్వ మెట్టిదో యీ శ్యామసుందరాదులు నలువురు శస్త్రపాణులై వచ్చి యాక్రూరుని బంధించి నన్నుఁ గాపాడిరి. వీరియప్పును దీర్చుకొనుట కొక్కజన్మము చాలదు. నన్ను సోదరికంటె నెక్కుడుగారవించుచు నిద్రలేక కాపాడుచున్నవారు. ఉపహార మిచ్చిరి. మీ రీలేఖయందఁగనే యనంతాచలశర్మను బిలువం బంపి సపర్యలం దన్పుఁడు. ఆమహాత్మునిశిష్యులే యీ నలువు రఁట. వారు పంపఁగా వచ్చి కాచియుండిరఁట. జనకులు రాఁగా

నేను వచ్చి మిమ్ము దర్శించెద. దేవికి నైవేద్యము కాఁగా నాకు భోజనము పెట్టుదురు. మీ రించుకంతయుఁ జింతింపనుఁడు. నన్నుం జూడఁగలరు. నేనును మిమ్ముసేవింప నువ్విళ్లూరుచున్న దాన. ఇపుడింతకంటె విశేషించి తెలుపఁదగువార్తలు లేవు. భయముమాని యుండవలయును.

ఇట్లని విన్నవించు మీ ప్రియ పుత్త్రిక రాధిక.

కృష్ణాష్టమీస్థిరవారము."

ఈ లేఖను గైకొని యాశ్వికు లరిగి యిందిరాదేవి కిచ్చిరి. ప్రియకుమారికా హస్తాక్షరములం దిలకించిన యిందిరాదేవి సమ్మోదమునువర్ణింప నెవ్వరికేఁ దరంబే! ఆమె మరలమరలఁ జదువుచుఁ దనవారికెల్ల వినిపించుచుఁ గొంతకాల మాయామోదమునఁ బ్రొద్దెంతయెక్కినదియు నెఱుంగకుండెను. మధ్యాహ్నమైనది. భుజింపవలయునని యెందఱో ప్రార్థించిరి. జలపానమే భోజనమని బదులుచెప్పి యిందిరాదేవి యూరకుండెను. రాధిక వ్రాసినపత్త్రికయే యామె కానాఁడు ప్రొద్దుపోవఁ జేయుచుండెను. నగరవాసులంద ఱానాఁడు శ్రీనివాసదాసగృహముననే యుండిరి. వచ్చువారికిఁ బోవువారికి విరామము లేకయుండెను. వారితో సంభాషించుటచే నిందిరాదేవి బ్రదుకఁజాలెనుగాని లేకయున్న నీలోకమును వీడియే యుండును.

సూర్యాస్తమయమునకు ముందే శ్రీనివాసదాసు విలాసధామమును జేరెను కొంతదూరముననే కాహళుఁడు వేచియుండెను గాన దర్శించి రాధికాకుశలవార్తను దెల్పెను. వానింగూడి యావార్తలనే యాలకించుచు నగరమును జేరి యెడనెడఁ బెద్దలూఱడింపఁగా నించుక చింతించుచు ధైర్యము

తెచ్చుకొనుచు గృహముఁ జేరెను. లోపలికిం జని యిందిరా దేవిం గనుఁగొనియె. కూరుచుండియున్న యిందిర లేవఁబోయి రాధికా యని యట్టె కూలఁబడియెను. ఆమెంగాంచి శ్రీనివాస దాసును మూర్ఛిల్లెను. ఎన్నియో యుపచారము లొనరింప నించుక తెలివిగల్గి కూరుచుండెను. ఇందిర నూఱడింపుఁడని యందఱు హెచ్చరించిరి. ఆపెను లేవనెత్తి వీఁపు నిమురుచు నీశ్వరుఁ డనుగ్రహించెను. దుఃఖింపకుము. రాధికం గొనివచ్చెద. ఊఱడిల్లుమని పలుమాఱులు హెచ్చరించెను. ఆమె మాట లాడఁజాలక రాధికాకరాక్షరవిలసత్పత్త్రిక నొసంగెను. దానిం జదువుకొనుచు దీనాననుండగుచు నశ్రూదకముల నాపత్త్రికను దడుపుచుఁ గొంతసేపుండి యించుక యూఱడిల్లి శ్యామసుంద రాదుల యుపకారమునకుఁ బారములేదని కొనియాడుచు ననంతాచలశర్మగారి పట్టుదలకుఁ బరమానందము నొందుచు నిఁక భరతపురమున కరుగు ప్రయత్న మొనర్పుమని కాహాళునకుం జెప్పెను.

అంత రక్షకభటాధ్యక్షుఁడు భటులం గూడి వచ్చి శ్రీనివాసదాసుం గనుంగొని తమయభియోగము విచారింప వచ్చితిమి. భరతపురమున మీకుమారియు నామె నెత్తుకొని పోయిన దుష్టుఁడు నున్నయట్లు కనుఁగొంటిమి. మేమిపుడే పోవుచున్నవారము. ప్రయాణోచిత ప్రయత్నముం జేసి మమ్ము సాగనంపుఁడు అన దాసు మీ రచ్చటికేగి యేమి చేయ నూహించితిరో వినఁగోరెదనని ప్రార్థించెను. మే మచ్చ టికింబోయి యాదుష్టుని బంధించి మీకుమారికను దీసికొని మాకార్యస్థానమునకుం బోయి విచారింతుము. అని బదులు

వచ్చెను. మీకంటె ముందే దుష్టుఁడగుపాత్రాళుని బంధించి యుంచినారు. మీకార్యమనుకూడ నక్కఱలేదు. మేమే వానిని దెచ్చిమీకార్యాలయమున నప్పగింతుము తమరు సుఖంబుండుఁడని దాసు విన్నవించెను. ఆయధ్యక్షుఁడు మండిపడి వానిం గట్టివేయునధికారం మితరులకు లేదు. మీవా రెట్లు బంధించిరో విచారింపవలయునని కఠినవాక్కులం బలికెను. దొంగ పాఱిపోవుచుండఁ జూచినవాఁ డేమిచేయవలయునో యెఱుంగఁ గోరెదనని దాసు ప్రశ్నింప నపుడే వచ్చి మాకుం దెలుప వలయును.

దాసు—ఆమీఁద మీ రేమిచేయుదురు ?

అధ్య—వాని వెంటఁగొని భటులు చోరుఁ బట్టఁబోయెదరు ?

దాసు—వాఁ డగపడు టెట్లు ?

అధ్య—వానిం జూపునట్టిపని యాతనిదే

దాసు—వాఁ డీలోపల నాద్రవ్యమును బాడుచేసిన నిది మాదని గుఱుతించు టెట్లు ?

అధ్య—వానివెంటఁ గొందఱు పోవలయు. ఆవస్తువులను వాఁ డేమిచేయకయుండఁ గాపాడుచుండి మాకుం జూపవలయు.

దాసు—ఈదినము దొంగలు వత్తురని తెలిసికొని మనుష్యులను సిద్ధముగానుంచుకొని కొందఱిని వారివెంటఁ బంపి కొందఱు మీతావునకు రావలయునా ? అంతియకాక తెలిసియున్న నూరకయుండి వారు కన్నముపెట్టి లోపలికివచ్చి వస్తువుల నపహరించికొనిపోవఁ బ్రయత్నిం

చిన దనుక నూరకయుండి యప్పుడుకదా తమదర్శనమునకు రావలయును ఇది మంచిన్యాయమార్గమే.

అనుచుండునంత నగరాధిపతి దాసురాక విని యచటి కరు దెంచెను. వారిరాక నెఱింగి రక్షకభటాధ్యక్షుఁడు కాలికి బుద్ధి చెప్పెను.

నగరాధిపతి దాసునూఱడించి యిట్టి యకార్యము మన నగరమున నీవఱకు సాగలేదనియు, నిది యచ్చెరువును గల్గించు చున్నదనియు, నీశ్వరానుగ్రహమునఁ దమపుత్రికకు నించుకయు నాపదగలుగకుండ నాపరమేశ్వరుఁడే కాపాడెననియుఁ దెలిపి మీయనుమతియైనచో నాదుష్టుని మాస్వాధీనము చేసికొని విచా రింతుమనియు, మర్యాద నతిక్రమింపక మీయింటికి వచ్చి రాధిక నడుగుదుమనియు, నిపుడు పాపమని వదలిన నిట్టివాం డ్రింక నెందఱకో మార్గమును జూపించువారగుదురనియు, నది నగర మునకే యపకీర్తిని హానిని దెచ్చుననియు, మంచిమాటలఁ దెలిపెను. దాసు నేనిపుడు పోయి వానిం జూచి తమకుఁ దెలు పుదుననియె నగరాధిపతి దాసుగారూ! నాయీమాట నాల కింపుఁడు. మీరిపు డచ్చటికిం బోవుటుచితము కాదు. ఆదురా త్ముని జూడఁగనే మీకుఁ బట్టశక్యముగాని యాగ్రహము పొడ సూపును. ఏమిసాగినను ముందు మీప్రఖ్యాతి కయ్యది మచ్చవంటిదగును. నామాటం బాటించి మీరు పోవుటుడిగి కుమారికను బిలువనంపుఁడు. అచ్చటి తక్కిన కృత్యములు మాయధీనములుగ నొనరింపుఁడని సమర్యాదగాఁ బలికెను. దా సాపలుకులను మన్నించి తమభావమునే యనుసరింతునని విన్న వించెను.

ఆ యుత్తరక్షణమున నగరాధిపతి భరతపురమునకుఁ బరిజనులతో బయలువెడలెను కాహాళుఁ డుత్తమశిబికం గొనిపోయెను కొలఁదిమూరుతముల కాదేవాలయముకడం జేరిరి. నగరాధిపతి యచ్చటికిం బోయి కన్నియ నాశ్వాసించి యాహారాదుల నిచ్చితిరా యని యడిగి వేంకటేశ్వర ప్రభృతుల మెచ్చుకొనుచు వాఙ్మూలాచారమును నడపి పాతాళుని మంచిమాటలతో నిజము పల్కుము లేకున్న నిహాపరములకుం జెడుదువని హెచ్చరించెను. తనదుష్ప్రయత్నము దైవవశమునఁ దాఱుమాఱగుటకుం జింతిల్లి నిజము చెప్పకున్న మఱింత యాగ్రహ మాయధికారికిం గల్గునని యూహించి బుద్ధిలేక యిట్లు చేసితినని తనప్రయత్న మెల్ల నెఱింగించెను కుంతలుఁడు తనయవివేకము నొప్పుకొనియెను. బంధింపఁబడిన యా యిరువురువ్యాధులును దమపనియంతయుఁ దెలిపి శరణువేఁడిరి తక్కినయేడుగురను బట్టుకొన భటుల కాజ్ఞాపించిన వారు బద్ధులగు నిరువురను దోడుకొనిపోయిరి. ఉత్తమశిబిక రాఁగా రాధిక నందెక్కఁబంచి పరివారమును దనభటులను గూడనిచ్చి వేంకటేశ్వరాదులను నగరమునకుఁ బోవ సెలవిచ్చి యర్చకులవలన వాఙ్మూలరూపసారాంశమును దీసికొని వారిని నగరమునకు రమ్మని ముందు తెలుపుదుమని చెప్పి తనపని యంతయుఁ దీర్చుకొని భరతపురాధికారి కాదేవాలయమున రాత్రియందుఁ బరీక్షించు నధికార మొసంగి విలాసధామము నకుఁ బయన మయ్యెను.

రాధిక సిగ్గుచేఁ దల వంచుకొని దైవచేష్టితమును విచారించుచు మానవప్రయత్న మల్పతరమని యూహించుచు

నీగండముతప్పుట కాభగవతియనుగ్రహమే కారణమని నమ్ముచుఁ దలిదండ్రులఁ జూడ నాతురంపడుచుఁ బోయెను. శిబిక నతిజవమునఁ గొనిపోయిరి. తొలిజాము దాఁటకుండ నగరమును జేరిరి. మందిరద్వారముననే శ్రీనివాసదాసు సభార్యుఁడై కాచియుండెను. శిబిక దింపఁగా నమ్మా యని పిల్చుచు నాదంపతులట్లే మూర్ఛిల్లిరి. రాధిక యేమో పలుకఁబోయి మాటరాక యట్టె లేచి వారలపైఁ బడి విస్మృతిఁ గాంచెను. పెద్ద లెల్ల వారికి నుపచారములుచేసి యెట్లో తెప్పిరిల్లఁజేసిరి. అతికష్టముమీఁద నింటిలోనికి నెల్లరఁ జేర్పఁగలిగిరి. ఆదంపతుల విలాపము రాధికవ్యాకులపాటు పాషాణహృదయులకైన జాలిని బుట్టింపక మానదు. రెండవజాము దాఁటకుండ నందఱుపెద్దలు వారి నూఱడించి యిందిరయుపవాసమును దెలిపి యెట్లో భుజింపఁ జేసిరి రక్షకులెల్ల గృహము నప్రమత్తులై కాచుచుండ వారు శయనించిరి రాధికను వదలక యిందిర శయనించి ప్రాణముల నిలుపుకొనఁగల్గెను.

మఱుదిన మనంతాచలశర్మగారిని బిలువంబంచి శ్రీనివాసదాసు శ్రద్ధాభక్తులు వెలయ బహుమానించెను. పుత్త్రికాభిక్షము పెట్టినమహాత్ములు తమరే యని కొనియాడెను. మీఋణ మెన్నిజన్మములకైనఁ దీఱదని విన్నవించెను తమరీ సాయము చేయఁగల్గుటెట్లో తెలుపుఁడని ప్రార్థించెను. నగరాధిపతియు నం దుండెను. శర్మయుఁ బూసగ్రుచ్చినట్లు మొదటి నుండి కొసవఱకుఁ దెలిపెను. ఎల్లరు నాశ్చర్యంపడిరి. సహజవాత్సల్యము గల యాపండితుని గొనియాడిరి. నగరాధిపతి పాతాళుని యకృత్యమునకు వెఱఁగంది యనంతాచలశర్మ

నుండి వాఙ్మూలపుఁబద్ధతి నిర్వహించెను. మరలఁ బిలుపింతు మనియు నాఁటికి రాజకీయన్యాయస్థానమునకు రావలయు ననియుఁ దెలిపెను. రాధికయు నిందిరాదేవియుఁ దమయిడు మలఁ దలంచుకొనుచు నీగండము తప్పించిన వాభగవతి యను విశ్వాసమున నూఱడిల్లిరి. ఈవార్త క్రమక్రమముగా జాలంధరముదనుకఁ బ్రాఁకెను.

శ్రీనివాసదాసు పయనము సాగించినదినమే రామదాసు శ్రీవత్సాంకదాసుతో మాటలాడుచు రాధిక కొక్కకష్టము వచ్చుననియు, నది విచిత్రరీతిగాఁ దప్పుననియు నాయాపదచే నామెవిఖ్యాతి లోకమున వ్యాపించుననియు నామె కోడలు గాఁగలభాగ్యము నీయదృష్టమునఁ గలుగఁగలదనియుఁ ద్వరగా విలాసధామమున కరుగవలసియుండుననియు నీవిషయ మితరులకుఁ దెలుపవలదనియుఁ జెప్పెను. రామదాసు యోగ దృష్టిగల మహాత్ముఁడని శ్రీవత్సాంకదాసు నమ్మియున్నవాఁడు గనుక నావాక్యములు తప్పక ఫలించుననియు నేవిధమగు కష్టము గల్గునోయనియు విచారించుచుండెను. ఆమూఁడవ దినమే యీవార్త యించుక మార్పుతోఁ దెలియవచ్చెను. పిడుగుపాటువంటి యీవార్త విని భార్యయుఁ గుమారుఁడును విచారింపసాగిరి శ్రీవత్సాంకదాసు మాత్రము వారి నూఱడిల్లఁ జేసి తాను బ్రయాణమై రామదాసుంగూడి విలాసధామము నకుఁ బోయెను. పయనముచేయునపుడు భార్యతో వివాహ ప్రయత్నములు క్రమముగా సాగించుచుండుమనియు నీవార్త నాకింతకుముందే తెలియుననియుఁ దప్పక రాధిక మనకుఁ గోడలగుననియు ద్విగుణితోత్సాహమునఁ బనులు సాగింపు

మనియుఁ దెల్పి పోయెను. రెండవదినమే శ్రీనివాసదాసుం జూచెను. అతఁ డించుక లజ్జించి యట్టె మోముచంచెను. రామదా సాతని నాశ్వాసించెను. అతఁ డంతటలేచి యెల్లవారును విను చుండ రామదాసుగారు తనతో నారాత్రి తెల్పిన గూఢార్థము గలమాటలం దెల్పి వారిమహత్త్వమును గొనియాడెను. ఎల్లరు నచ్చెరువుపడిరి. శ్రీవత్సాంకదాసును దనకా మఱుదినము తెల్పినవార్తలం దెల్పెను. ఎల్లవారు విని కష్టములు గట్టెక్కినవి. కావున నిఁక శుభప్రయత్నము సాగింపవచ్చుననిరి. "శుభస్య శీఘ్ర"మ్మను న్యాయము ననుసరించుటయే మేలని రామదాసు చెప్పెను. పెద్దలందఱు "తథాస్తు"నిరి.

ఆదినము మఱుదినము రామదాసుంగూడి శ్రీవత్సాంకదాసందే యుండి రాధికకుఁ గల విద్యాపాండిత్యము కలాకౌశలముఁ బరికించి తనదే భాగ్యమని పరమానందభరితుఁడయ్యెను. ఆమెశీలము నెల్లరుం బొగడుట వినఁబడినపు డాతని యానందపారవశ్యమునకుఁ బారము లేక యుండెను. ఇట్లు రాధికాశీలవిద్యావైశద్యములు వారి యింటిమర్యాదలు గాంచి తగినసంబంధమును బరమేశ్వరుఁడు రామదాసరూపమున ననుగ్రహించెనని తలంచుచుఁ బ్రయాణముచేయ ననుమతి వేఁడ శ్రీనివాసదాసు మహాత్ములరాక మాభాగ్యమున మీమూలమునఁ గల్గినది. కావున నిఁక సుముహూర్తము నిశ్చయము చేసికొని పొమ్మని యభ్యర్థింప నాదినము నిలిచెను. అభియోగవిచారణ మెప్పుడో తెలియనందున నద్దాని కాయది యడ్డుగానుండ రాదని యెల్లరభావమైనందున జాలంధరపురము నుండియే రామదాసుగారివలన నిశ్చయింపఁబడిన ముహూర్తము

తెలుపుడనియు దానిని మే మంగీకరింతుమనియు నీయభి యోగము తీర్మానింపఁ బడినవెంటనే తమకుం దెలుపుదుమనియుఁ బ్రార్థించి శ్రీవత్సాంకదాసును గురువర్యులగు రామదాసు గారిని బ్రయాణముచేయ సమ్మతించెను. వారును జాలంధరపుర మున కరిగిరి.

నగరాధ్యక్షుఁడు విచారించుదిన మిదియని నిర్ణయించి తెలిపెను. ఆనాఁడు శిబికను మోసికొనిపోయిన యేడుగురు వ్యాధులును జిక్కిరి వారిని జెఱసాలయం దుంచిరి. భరత పురమునుండి యర్చకులకు మఱికొందఱకు నాహ్వానపత్రిక లంపఁబడియెను. ఎల్లరు రాజకీయమందిరమునఁ గూడిరి. రాధి కయు నిందిరాదేవియు దాసికలును బోవవలసివచ్చెను. ఇందిరా రాధికలు శిబిక నెక్కివెళ్లిరి వారికొకగది నిర్ణయింపఁబడి యుండెను. వారి యనుచరీబృందము కూడ నందే యుండ నాజ్ఞయయ్యెను. నగరాధిపతి తనపీఠము నధిష్ఠించెను. నగర మునఁ గలపెద్దలు పెక్కం డ్రందుఁ జేరిరి. రక్షకభటాధ్య క్షుఁడు తనయుద్యోగులతోడ భయంకరాకారమున నరుదెం చెను. విమర్శకు లుచితపీఠములఁ గూరుచుండిరి. దోషులు పాతాళుఁడు కుంతలుఁడు తొమ్మండుగురు వ్యాధులు నిగళ బద్ధులై నిలుపఁబడిరి. వారి యిరుపార్శ్వములయందుఁ దళతళ లాడు నసిపుత్రికలంబూనిన రక్షకభటులు నిలిచియుండిరి. పాతాళ కుంతలులు తలయెత్తక వంచియుండిరి.

## న్యాయవిమర్శము.

నగరాధిపతి యొక యుద్యోగిని బిల్చి దోషులచెంత నిలుచుండి నాపల్కుమాటల వారికిం జెప్పుమని పంప నాతఁడు

వారికడ నిలుచుండెను. దోషులారా! మీరు సప్తమీశుక్ర వారమున రాధికను కుటిలమార్గమున నెత్తుకొనిపోయినట్లు, భరతపుర కాళీకాలయమున నామెను బలవంతపఱచి పాతాళుఁడు పెండ్లి చేసికొనఁబూనఁగాఁ గుంతలుఁడు పురోహితత్వము నడుప సిద్ధముగా నుండ నీశ్వరానుగ్రహమున వేంకటేశ్వరాదులు నల్వురు వచ్చినట్లు, పాతాళుఁడు వివాహమున కంగీకరింపని రాధికను వధింపఁబూనినట్లు, వేంకటేశ్వరాదులు వారించి మిమ్ములఁ గట్టివైచినట్లుగా నభియోగము చేయఁబడినది. వారభియోగమునఁ జెప్పియున్నయట్లు మీరెల్ల నందుఁ గట్టివేయఁబడియే యుంటిరి. ఖడ్గము కొన్ని మూలికలు కొన్ని కాటుకలు నీసంచియందుఁ గలవని స్పష్టపడుచున్నయవి. ఈ కారణములవలన మీరు దుష్కృత్యము చేసితిరని నమ్మవలసి యున్నయది. దీనికెల్ల మీప్రతివాదము తెలుపవలయును. ప్రతివాదము సత్యసమ్మతమైన యెడల మీరు నిర్దోషు లనఁ బడుదురు. లేనిచో సదోషు లనఁబడుదురు. అభియోగము సత్యసమ్మతమని మీవాదమునుబట్టియు దృఢపడునేని మీరు శిక్షాపాత్రులగుదురు. కావున మీరు యథార్థమగు ప్రతివాదమును దెల్పుఁడని యొఱింగించెను.

పాతాళుఁడు తనవాదము ని ట్లెఱింగించెను. న్యాయమూర్తీ! అనంతాచలశాస్త్రిగారికి నాకు సహజవిరోధము. అపుడపుడు మంచినీళ్లబావికి మాతల్లి యుండినకాలమున నీళ్లకుఁ బోవుచుండెడిది. వారిభార్యయు నచ్చటికి వచ్చునఁట. ఏదో యొకహేతువునుబట్టి కలహించుకొనిరఁట. నన్నెట్లైనఁ గారాగృహమునకుం బంపునుపాయము చేయుదునని

యాఁమెమగఁడు పంతముపట్టెను. అపుడపుడు నన్నామాటచేఁ దూలనాడువాఁడు. ఇదియేగాక మఱియొకవిరోధము కలదు. ఆతనికడకుం బోయి భూతచికిత్స చేయించుకొనువారలు కొందఱట నుపయోగము లేమి నాకడకు వచ్చిరి. వారి కీవలసిన ద్రవ్యము లాభము లేదని యీయకుండుట కల దని వింటిని. నాకడ వారికి మేలు గలుగును తన ద్రవ్యము నేను బోఁగొట్టితినని నాపై నాయనకసూయ. శిష్యులమూల మున నీపని చేయించెను. నేను భరతపురదేవాలయమునకుఁ బలుసారులు పోవుచుందును. ఆకాళికాదేవి మా యిలు వేల్పు. అర్చకులు నన్నెఱుఁగుదురు. ఆనాఁడు నేను శుక్ర వారపూజకొఱకుఁ బోయియుండఁగా నన్నుఁ గట్టివైచిరి. రాధికను బిలుచుకొనివచ్చినది వారే. అనంతాచలశర్మను శ్రీని వాసదాసునకు మిక్కిలి సావాసము వారేమి మాటలాడి కొని యీకార్యముచేసిరో భగవంతునకే యెఱుక. ఈఖడ్గము గాని యీమూలికాదులుగాని నావి కావు. ఇంతకంటె నే నేమియు నెఱుంగను. న్యాయమును బరిశీలించి నావాదమునఁ గలసత్యమును జిత్తగించి తమ చిత్తానుసారము చేయుఁడు. కడుంగడు బీదవాఁడను. మానవులసాయము నాకేమాత్రము లేదు. సత్యమునే నమ్మియున్నాఁడనని తనవాదమును ముగిం చెను.

కుంతలుఁడు తనప్రతివాదము నిట్లు సాగించెను. భరత పురమునఁ గొన్నివివాహములు చేయింపఁ బోయియుంటిని. శుక్రవారము కదాయని నృసింహస్వామిదర్శనమునకుఁ బోయి తిని. వివాహములు చేయించి దేవాలయమునకు వధూవరులం

బిలుచుకొని పోవునప్పటికే ప్రొద్దుపోయెను. అర్చకులు తలుపులు వేసిపోయిరని యెవరో తెల్పినందునఁ బెండ్లివారు మరలి పోయిరి. కొంతదూరము వచ్చితిని గదా ప్రదక్షిణముచేసి యైనఁ బోవుదమని పోవఁగా ద్వారములు మూయఁబడక యుండెను. సంతసించి లోపలికిం బోయి ప్రదక్షిణముచేసి నరసింహమూర్తిదర్శనము చేయఁ బోవఁగనే నన్ను నీ వేంకటేశ్వరాదులు కట్టివైచిరి. వివాహార్థమై దర్భలు తీసికొనిపోవుట పురోహితులయలవాటు. దర్భలు లేకయున్న శుభకార్యములు సాగవు. నన్నుఁ గట్టివేయునపు డిదియేమన్యాయమయ్యాయని యడిగితిని. వేంకటేశ్వరులు మనకుఁ దగినవాఁడు దొరకెనని కట్టివేయుఁ డనెను. ఇదియే నావాదము. సత్యమును బాలింపఁ బ్రార్థించెదనని కుంతలుఁ డూరకయుండెను. తక్కిన వారు తోఁచినట్లసంగతముగా మాటలాడిరి.

రాధికను బిలిచి మర్యాద ననుసరించి కూరుచుండం బనిచి యభియోగమును వినిపించి యింకనేమైనఁ జెప్పవలసినది కలదా యని ప్రశ్నింప లేదనియె. ఆపత్త్రము నీచే వ్రాయఁబడినదా యనియడుగ నౌననిపలికెను. ఈకన్నియనేమైనఁ బ్రశ్నింపవలయునేని యాప్రశ్నముల మాకుం దెల్పిన మే మడుగుదుమని న్యాయమూర్తి పలుకఁ బాతాళునిబంధు వొకపండితుఁడు వచ్చి యసందర్భముగా నేమేమో ప్రశ్నింపఁగా నవి ప్రకృతోపయుక్తములు కావని తిరస్కరింపఁబడియెను.

అర్చకు లిరువురును దగ్గుత్తికలఁ దమ రాచరించినపని యంతయు నున్నదున్నట్లు చెప్పిరిగాని రాధికనుగుఱించి

పాతాళుఁడు చెప్పినది దాఁచిరి. పెండ్లి యన్న మే మా యాల యమున నుంటిమనియు, జననీజనకు లేల రాలేదని ప్రశ్నించితి మనియు, నింతలో వేంకటేశాదులు వచ్చిరనియుఁ దెల్పిరి. అనంతాచలశర్మ తనకుఁ దెలిసినవిషయము తెలుపుచు నుంత యు దాఁపక సవిస్తరముగాఁ దెల్పెను. వేంకటేశ్వరాదులు గురునానతియుఁ దమరచట దాఁగియుండుటయు సమయమున నాలసింపక పైఁబడి వానిని గుంతలుని బట్టుకొనుటయును దెలిపి వెంటనే భరతపురమునకుం బోయి పెద్దలకుఁ దెలుపు టయు వారు సాయపడుటయు లోనగు తమకృత్యములఁ దెలిపిరి. విచారింపఁదగినవా రెల్ల విచారింపఁబడిరి. రెండుదిన ములు నిరంతరముగా విమర్శించి యామఱుదినము తీర్పు చెప్పుదుమని న్యాయమూర్తు లనిరి. ఎల్లవారు నిండ్లకుం బోయిరి.

మఱుదినము న్యాయస్థానము మనుజులచేఁ గ్రిక్కిఱిసి యుండెను ఎపుడు న్యాయమూర్తు లరుదెంతురో ఏమి తీర్పు చెప్పుదురో యరయుదమని వేచియుండిరి. వీరి తొందఱపా టుచే మఱెంత యాలస్యము న్యాయమూర్తి చేయుచున్న యట్లు తోఁచెను. యథావిధిగా న్యాయాధిపతి యరుదెంచెను. సింహాపీఠిక నలంకరించెను. శ్రీనివాసదాసు రాధికయుఁ బోయిరి. రాధిక యథాపూర్వస్థలమున సపరిచారికయై యుండెను. పండితులెల్ల న్యాయాధిపతి కెదుటనే కూరుచుండిరి. అంతట నుత్తమాధికారి తీర్పు నిట్లు చదివెను.

"ఈయభియోగమున న్యాయపరిశీలన మంత దుర్భే ద్యము కాదు. ఇట్టి వ్యవహార మెన్నఁడు విన లేదు. పాతా

ళుఁడు దోషియే యని యాతని వాఙ్మూలమునుబట్టి కూడ నూహింపవచ్చును. అనంతాచలశర్మగారిసాక్ష్య మిందుఁ బ్రధానము. వేంకటేశ్వరాదులు ప్రత్యక్షముగాఁ బాతాళుని దుండగములఁ బరిశీలించినవారు. వీరిసాక్ష్యము నమ్మక పోవుటకు హేతు వగపడదు. ఇంతకంటె సాక్ష్యముత్తమము లోకమునసే యుండదు. భరతపురమునఁ గొందఱు పెద్దమనుష్యుల విచారించితిని. ఈషత్తేని భేదము లేక సాగినది సాగినట్లే చెప్పిరి. కావున నభియోగపక్షమునఁ దృప్తికరముగా విషయము నిర్ధారణము చేయఁబడినది. ఇఁకఁ బ్రత్యభియోగ పక్షమునుగుఱించి తర్కించెదను. పాతాళుఁ డనంతాచలశర్మ గారితోఁ దనకు విరోధము గలిగెననియు, వారిశిష్యులగు వేంకటేశ్వరాదు లీపన్నాగమును బన్నిరనియుఁ దెల్పినకారణములే యాతని నింద్యునిగఁ జేయుచున్నవి ఏలనఁ గారణములన్నియు దుర్బలములు. కేవలకల్పితములు దుష్టకార్యజనకములు. పాతాళునికడ నున్నకాటుకలు మూలికలు పరీక్షింపఁగాఁ బరాపకార మొనరింపఁదగియున్నవి. కుంతలునికడ మంగళసూత్రాది వివాహోచితపదార్థములు కలవు. ఆ నాఁడు భరతపురమున వివాహములే సాగలేదని యెల్లవారుఁ దెల్పిరి. కావున వీరిరువురు నాలోచించుకొనియే యీదురంత కృత్యమును జేసిరని నమ్మవలసియే యున్నది.

ఈకార్యములు సామాన్యములు కావు. ఒక్కకన్యను నిర్బంధపెట్టి యామెయావజ్జీవము దుఃఖపడునట్లుచేయుటయు, నంగీకరింపకయున్నవధింపఁబూనుటయు ననునవి దుష్కార్యములనఁదగియున్నవి. ఈరెండుపను లీయదనున సాగెను. రాత్రి

కాలమునఁ బరునియింటఁ జొచ్చి కృత్రిమోపాయముల నొక స్త్రీని గొనిపోవుటయుఁ బైవానికి సమానమగు దుష్కార్యము. ఈమూఁ డపరాధముల నొనరించి పాతాళుఁడు పరమనింద్యుఁ డయ్యెను.

శ్లో. కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః,
సుకృతే దుష్కృతే చైవ చత్వారస్సమభాగినః.

అను ప్రమాణము ననుసరించి కుంతలుఁడు పాతాళు నకు సమానుఁడే యనవలసియున్నది. కాని కుంతలుఁడు పాతాళునిచే నీకార్యము చేయించినట్లు, చేయఁ బురికొలిపి నట్లు మాత్రము తేలలేదు. కానఁ బాతాళునికార్యము నామోదించినట్లు, విశేషించి తోడ్పడినట్లు, నిశ్చయింపవలయు. నే నట్టియభిప్రాయమునకే వచ్చియున్నాఁడను. ఈవిచారణ మును దైవము నెదుట నునుచుకొని పక్షపాతమూనక యే సాగించితిని. ఏవిషయమునను బాతాళుని గుంతలుని క్షమిం చుటకు లేశమైన నవకాశము దొరకదయ్యెను. ప్రథమాప రాధమని కరుణఁజూపను గూడ నవకాశము లేదు. ఇది యిత రులకు మార్గదర్శకము కూడ నగును. కావున నామనోనిశ్చి తార్థమును న్యాయసాహాయ్యమునఁ దెలుపుచున్నాఁడను. పాతాళుఁ డామరణము కారాగారముననుండి పాటుపడుచుండ వలసినట్లు, కుంతలుఁడు పదిసంవత్సరములు కారాగృహమున నుండి సామాన్యకార్యములయం దాయధికారుల యుత్త రువుచొప్పునఁ బ్రవర్తించుచుండవలసినట్లు తీర్మానించుచున్న వాఁడను అర్చకులిరువురు దుష్కార్యమును జూచుచున్న యట్లు మాత్రము తేలెను. కావున వారికి ముందే పాతాళుని

దుష్కార్యము తెలిసియుండక తప్పదు. ఆయపరాధమునకై వారొక్కసంవత్సరము సాధారణ కారాగారమున నుండవలయును. తొమ్మండ్రు వ్యాధులు ద్రవ్యాశచే నీదుష్కార్యమునకుఁ దమతోడ్పాడును జూపిరి కావున వారు నాలుగు సంవత్సరములు చెఱసాలయందుండి కష్టములకు లోనగుచుండవలయును. వేంకటేశ్వర ప్రముఖులు నలువురు నసాధారణసాహసము నెఱపి కన్యకాప్రాణమును గాపాడి ప్రభుత్వమునకు సాయపడి కీర్తిని దెచ్చిరి. కావున రాజసన్మానార్హు లగుదురు. కావున వారలు సువర్ణకంకణములను ప్రభువులనుండి పొందఁగలవారు. అనంతాచలశర్మగారీవిషయమును దమకుఁ దెలిసినపుడే దొరతనమున కెఱిఁగింపవలసి యుండెను అట్లేల చేయరైరని తొలుత నూహించితిని. అద్దానికంటె నిపుడు సాగించిన మహాకార్యమే సమంజసమని యెన్నఁదగియున్నది. కావున వారు రాజసన్మానార్హులు. వారికిఁ బ్రభుత్వమునుండి "యార్తరక్షక" బిరుద మొసఁగఁబడు.

ఇట్లు న్యాయాధికారి."

అని వ్రాసిన తనతీర్పును జదివెను.

రక్షకభటులు యమకింకరులం బోలువారు వారినెల్లఁ గారాగారాధిపతిచెంతకుం బిలుచుకొనిపోవుచుండఁ గుంతలుఁడు కంఠమెత్తి "ప్రారబ్ధకర్మణాం భోగాదేవ క్షయః"అన్న న్యాయము నా కనుభవమున సిద్ధమైనది వెనుకఁ జింతించుట వెఱ్ఱితనమని పలుకుచుఁ గూడఁ బోయెను. ఆతీర్పును విని యెల్లవారు న్యాయాధికారిబుద్ధిచమత్కృతికి న్యాయపరిశీలనమునకుఁ గడు మెచ్చు

కొనిరి. ఇఁక నిట్టిదుష్కార్యములు సాగవని తలంచిరి. పిదపఁ దమ తమయిరవులకుం బోయిరి.

---

# ఆఱవ వీచిక.

"ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్."

అని ప్రాచీనోక్తి కలదు. ఆసూక్తి యేకాలమున నైనను మార్పునొందదనుట నిక్కవము. ఈర్ష్యాళువులు సాధువుల మేలునకే కీడు గల్గింపఁబూనుదురు. ఇది లోకమున సాధారణముగా సాగునాచారము. ఈ యాచారమునకు లోఁబడక యుండువారు లేదనరాదు విరళముగాఁ గలరనవలయు. ఈయాచారమును బాటించియే కాఁబోలు పాతాళభైరవనిబంధువులు వానికారాగారప్రవేశము మొదలుకొని లేఖల వ్రాసి రామదాసని కృష్ణదాసని లోనగుపేరులతో శ్రీనివాసదాసునకుఁ బంపసాగిరి. రాధికప్రవర్తనము మంచిది కాదనియుఁ, బెక్కండ్రామెకు నేస్తగాండ్రు కలరనియు, మీవంటిమర్యాద గల కుటుంబములవా రట్టికన్యకలను గోడండ్రగా గ్రహింపరాదనియు, సౌందర్యమునుబట్టి మీరు మోసపోయినను స్వల్పకాలమునకే మీమర్యాద యూడిపోవుననియుఁ, దర్వాత విచారించిన లాభములేదనియుఁ గొంత యాలోచించి ప్రయత్నించిన మేలనియు, నందు వ్రాయఁబడుచుండెను. రామదాసు శ్రీనివాసదాసునకు మిత్రుఁడనియు, మీసంబంధమును

గోరియే యతఁడు పంపఁబడినవాఁడనియు, వాని మాయా వాక్కుల నమ్మకయుండవలయుననియు, నింతకంటె విశేషించి మీవంటి మర్యాదాభూషితులకు వ్రాయ నక్కఱయుండ దనియు, మీసౌజన్యమును విన్నవారము కానఁ గళంకమురాఁ గూడదనునూహచేఁ దెలిపితిమనియు, మాయీభావమును మీరు విశ్వసింపకయుండినఁ దర్వాత విచారింపవలసి వచ్చు ననియు, నొక్కొక్క లేఖయందుఁ గడుఁ జమత్కారముగా వ్రాయఁబడుచుండెను. ఈలేఖలన్నియు శ్రీవత్సాంకదాసునకుఁ బద్మావతిదేవికిని మిగుల విచారమును గలిగింపసాగెను. ఒక్కొక్కసారి యిందు నిజముండకపోవునా యనియు స్ఫురింప సాగెను. రామదాసుగారియందు నించుకసంశయము గలుగ సాగెను. పిలువనిపేరంటముగా వచ్చుటకిదియే హేతువుండునా యనియు వారూహింపసాగిరి. రాధికకు సంగీత చిత్ర లేఖనములఁ గలకౌశలము దుష్ప్రవృత్తిని గలుగఁ జేయునదియే యగుటం బట్టి యామె మనకుఁ గోడలుగానుండి మర్యాదకాపాడునో లేదో యని పలుసారు లనుమానింపసాగిరి. రామదాసున కీవిషయము గోచరించినను యథాపూర్వముగ నున్నట్లె యుం డెను.

పదిదినము లిట్టియనుమానముల నాయిరువురు పరి తపించుచుఁ దుదకుఁ బరీక్షించిగాని వివాహమున కూఁకొన రాదని నిశ్చయించిరి. శ్రీకృష్ణదా సొకనాఁడు తనమిత్రుఁడగు శశిభూషణుని బిల్చి యీవిషయమంతయు నెఱిఁగించి విలాస ధామమునకుం బోయి వేషాంతరమునఁ గొన్నిదినములుండి యథార్థ మెఱిఁగిరమ్ము. జాగరూకుఁడవై చరింపుము. నా

మేలంతయు నీయదియేకదా యని యెంతయుం బ్రోత్సహించెను. శశిభూషణుఁడు విశ్వాసపాత్రుఁడు. సత్యహితుఁడు. పరోపకార నిపుణుఁడు. కావున శ్రీవత్సాంకదాసుని మనస్సంశయమును దొలఁగింపనెంచి సన్న్యాసివేషమూని విలాసధామమున కరిగెను. నాలుగైదుదినములు పల్లియలలో సంచరించుచు నందందుఁ గారణాంతరములచే వారివార్తలరయుచు నిష్కళంకయశస్సును విని యానందించుచు విలాసధామమును జేరి సత్రములలో భుజించుచు వేషాంతరములఁ బూని సంతర్పణములలోఁ దిరిగి భుజించుచు వార్తలరయుచుఁ బాతాళుని వ్యవహారమడిగి యానెపమున రాధికాప్రవృత్తిని బ్రశ్నించుచు దూషించునట్లు నటించి పాతాళునిపక్షమూని ప్రశ్నించుచు నెందఱినో యిట్లు మాటలాడించుచు నొకపక్ష మందుఁ గడపి శ్రీనివాసదాసు నింటికిం బోయి సన్న్యాసిగావున సులువుగ నాయింటం జొచ్చి సకలమర్యాదలొనరించి వారెల్ల గౌరవింప నందే నాల్గుదినము లుండి సకలవిషయములఁ బరీక్షించి వారియనుమతి నొంది వారాణసికరుగుమార్గమునం బోయి మరలి జాలంధరపురమున కుం బోయెను

ఈనడుమ మాసము గడచెను. శ్రీనివాసదాసునకు నిందిరాదేవికి నీయభియోగ మూలమున ననుమానము తోఁచు నేమో యనుశంక శ్రీవత్సాంకదాసున కుదయించెను. వివాహప్రయత్నములు సాగించుట విరమించి యనవరత మాలోచింపసాగెను. ఇందిరాదేవియు విచారసాగరనిమగ్న యయ్యెను. రాధిక వెడవెడ నావిషయమెఱింగి పగపా లయ్యెను. శశిభూషణుఁడు జాలంధరపురమును జేరి శ్రీవ

త్స్వాంకదాసుంగాంచి యేకాంతమున నెందో పూసగ్రుచ్చిన చందమున నావార్తల నన్నింటి నెఱింగించి ఘోర ప్రమాణముల నొనరించి వారి మనస్సంశయమును దుడిచివేసెను. ఆమఱు దినమే రామదాసుగారితో నాలోచించి సుముహూర్తము నిశ్చయించిరి.

ఆమఱుదినమే పురోహితుని బంపిరి. అతఁడరిగి శ్రీనివాస దాసునకు జాలంధరనగర వార్తల నెఱింగించి యామువ్వుర చింతలం దొలఁగించెను. దాసాభూసురుని సంతుష్టుంజేసి శుభ ముహూర్తమును దెలిపిన నేను బురోహితునింబంపుదుననియు రామదాసుగారు నిర్ణయించినదే ముహూర్తమనియుఁ దెల్పెను. ఆవార్తం గైకొని మరలి జాలంధరనగరమును జేరి గృహస్థ వర్యున కావార్తం దెలియఁజేసెను రామదాసు ముహూ ర్తము నిర్ణయించి శుభదినమున విలాసధామమునకుం బంపెను. శుభముహూర్తపత్రికను జూచి యాదంపతులు పరమా నందమునొంది విశేషించి వివాహప్రయత్నముల నొనరింప సాగిరి. నగరమంతయు నావివాహమహోత్సవమును గాంచఁ గోరుచున్నయట్టు లలంకరింపఁబడియెను. శక్తికనురూపముగ నెల్లవారును దమతమ గృహములకుముందు రంభాస్తంభాదుల నిలుపుకొన ననువగునట్లు పందిరుల వేసికొనసాగిరి. అందందుఁ బాంథులకు ఫలాహారము లమరింపఁబడుచుండెను. ఏవిషయ మునను గ్రొత్తవారి కామహోత్సవసమయమునఁ గొదువ రాకయుండునట్టు లుచితరీతి సాయపడ నెల్ల రుత్సుకులై యుండిరి.

జాలంధరనగరమునుండి పెండ్లికరుదెంచువారి కాయూ యితావుల శీతలవితానముల నమరింప శ్రీనివాసదా సూహించి యట్లే యొనరించెను. ఆపందిరులయందుఁ బానకము ఫలాహార ములు శిశువుల కావుపాలు నొసంగునట్టియేర్పాటు చక్కఁగా నొనరించెను. యోజనమున కొక్కతావున సత్రములఁ బెట్టించెను. ఆయాయిజాతులకు వేలువేలు భోజనముల నమరించి తదధికారులు సిద్ధముగనుండిరి. భోజనమునకు, నుపహారమునకుఁ గొదువరానీయరాదని దా సిట్టిప్రయత్నముల నొనరించె నని యెల్లరు సంతసిల్లుచుండిరి. దూరమునుండి పండితులురాఁ బ్రయత్నించుచుండిరి. కవులు గాయకులు పరిహాసకులు నర్తకులు సంఖ్యకుమిగిలి రాసాగిరి. నాలుగుదినములకు ముందే వచ్చినవారికెల్ల భోజనమునకుఁ గొదువలేనియట్లు చాటింపఁబడియెను. వేలకువేలుగా వచ్చినవారినందఱ నొక చోటఁ దోలి యొట్లో యన్నముపెట్టిన శ్రమమెక్కుడగుటయే కాక వారలకుఁ దృప్తియుఁ గలుగదని యూహించి గొుదువం దల కొక్కొక్కతావున భోజనమిడునట్టిపద్ధతి నొనరించెను. దా సుదారహృదయుఁడనియుఁ బరమాస్తికుఁడనియు నెల్లరు కనుఁగొనిరి. అంతియకాక స్వహస్తపాకులకు నర్హభవనములు నిర్ణయింపఁబడియెను. ఒక్కొక్కవిషయమునకుఁ గొందఱ నుద్యోగుల నిర్ణయించి యించుకంతయు లోప మావిషయ మున రానీయకుండఁ జేయవలయునని వారల హెచ్చరించెను.

తనసౌధమునకుముందు విశాలభాగము నావరించునట్టు లొకపందిరి వేయించెను. అయుతసంఖ్యాకు లందుఁ గూరు చుండ నర్హముగనుండఁ బీఠము లమర్పఁబడియెను. చుట్టును

నిలుచుండి కోలాహలము గావింపకుండ దానివెలుపల నున్న
తాసనము లుండఁజేసెను. రక్షకభటు లందందు నిలుచుండి
నిశ్శబ్దముగా నుండఁజేయుటకు నేర్పఱచెను. ఆపందిరి విచిత్ర
ముగా నలంకరింపఁబడియెను. చూచినది చూడకుండఁ జూచు
చుండినను మూఁడుదినములు పట్టునట్లు చిత్రము లందుండెను.
దానియెత్తిరువదబాహువులు. రామాయణభారతభాగవతాది
సద్గ్రంథములచరిత్రము లన్నియుఁ జిత్రములయందే కనఁబడు
చుండెను. ఆశిల్పమహిమము గొనియాడఁదగి విశ్వకర్మ నిర్మిత
మాయనఁ దోఁపఁజేయుచుండెను.

జాలంధరనగరావతంసమునకు సుముహూర్తమునకు
నొక్కదినముముందే దయచేయవలయునని శ్రీవత్సాంకదాసు
నకు శుభలేఖలనంపి పురోహితుని సపత్నికునిగా నంపెను.
వా రచ్చటఁ జేరఁగనే యుచితమర్యాదల నెఱపి గారవించి
బంధువులను హితులను రావించి సభచేయించి శుభలేఖఁ జది
వించి యాశీర్వదించిన వారియక్షతలను గైకొని యాపురో
హితులను విశేషించి గారవించి శ్రీవత్సాంకదాసు వివాహ
ప్రయాణమునకు సంసిద్ధుఁ డయ్యెను. బంధువులు మిత్రులు
పురోహితులు పరిజనులు ప్రయాణమునకు సంసిద్ధులైరి. ఉచిత
వాహన శకటశిబికాదు లాయత్తము చేయఁబడియెను. శుభ
దినమున శ్రీనివాసదాసపురోహితులు మార్గదర్శకు లగుచుండ
మహోత్సవముగాఁ దరలిరి చతురంగయానములు బహువిధ
శృంగారములఁ గైసేయఁబడియె. వానింజూడ మూఁగినజనుల
సంఖ్య వచింప నలవిగాక యుండెను. ఆవివాహమును జూడఁ
గోరికకలదని తెల్పినవారినెల్లఁ దోడుకొనిపోవ శ్రీవత్సాంక

దాసు సంకల్పించినందున యాచకులు గాక మూఁడువేల సంఖ్యకు మించినవారే ప్రయాణము సాగించిరి. అందందు విడుదుల నేర్పఱుపఁ బ్రయత్నించెనుగాని యంతకుముందే శ్రీనివాసదాసు వాని నేర్పఱచియున్నవార్త వినఁబడినందున నూరకుండెను. వారి శుభాగమనమున నాదరింపనున్న వారి యడంకువ కచ్చెరువందు వారిసంఖ్య యింతయని వచింపరాక యుండెను. ఎందు నిలువఁబూనిన నందే తగిన చలువపందిరు లుండెను. దిగినవెంటనే యాతిథేయసత్కారము లాచరింతురు. భోజనాదులు మిక్కిలి కొనియాడఁదగిన ట్లుండును. మరలఁ బయనముసాగించుటకుముందే యుపహారము లమర్పఁబడును. ఘోటకములకుఁ గూడ సుఖకరమగు ఘాసాద్యాహారము సిద్ధముగనుండును. పరిచారకుల కొనరించుసత్కారమే విచిత్రముగ నుండును. ఇఁకఁ బెండ్లివారివిషయమునఁ బ్రశ్నింప నవసర మేమియుండును?

కతిపయప్రయాణములకు విలాసధామ సమీపమును జేరఁగల్గిరి. అందొక రమ్యస్థానము నిర్మింపఁబడియుండెను. అందే వరపూజ చేయవలసినట్లు శ్రీనివాసదాసుగారి యాశయము. పెండ్లివా రచ్చటికి రాఁగా మంగళవాద్యములు చెలరేఁగెను. కొందఱిదియే వివాహమందిరమని భ్రమనొందిరి. అదొక పటకుటీరము. కుటీరమనుశబ్దమునకు సాధారణముగాఁ జెప్పుచున్నయర్థమున కది లక్ష్యముగాక యతివిశాలమై యున్నతమై హర్మ్యభ్రాంతిని గలిగించుచుండెను. అద్దానిం జేరరాఁగా వాద్యనిస్వనములు శ్రుతిహితములై శుభసూచకములై యొక్కుమ్మడి చెలఁగెను. అంతలోఁ గొందఱు ముత్తైదువులు

ఫలకుసుమ కుంకుమ పరిమళవస్తువ్రాతములఁ గైకొనియుఁ బురుషులు ఫలమంత్రాక్షతలఁ బూనియు నెదురుగఁ బోయి శ్రీకృష్ణదాసును నాశీర్వదించి యతని జననీజనకుల బహూకరించిరి. అది వారియింటఁ గలమర్యాద. ఆయాచారము నడపి ప్రార్థించి వరునిం బూజించి తోడితెచ్చిరి. అం దమర్పఁబడిన యున్నతాసనములపైఁ గూరుచుండఁ జేసిరి. హారతులెత్తి సువాసినులు దీవించిరి. విద్వాంసులు పెండ్లికొడుకువు గమ్మని యాశీర్వదించిరి.

అంతట శ్రీనివాసదాసు నిందిరాదేవియు నరుదెంచి కులోచితమర్యాదలం బాటించి కొంతతంతు నడపి విధివిహితముగ వరపూజచేసిరి పాదములు కడుగుచు నాతని లక్ష్మీనారాయణ స్వరూపునిగ భావించిరి. పిదప నొకరత్నహారము పురోహితుఁడా శ్రీకృష్ణదాసునికంఠమున వైచెను దాసు విహితపూజ లొనరించి కన్యాదానమును గైకొన రమ్మా యని యభ్యర్థించెను. పిదప వీరకానికి వీరకత్తియకును మర్యాదలు నడపిరి. వాద్యములు మ్రోఁగుచుండ వారవనితలు పాడుచుండ ద్విజప్రవరులు వేదమును బఠించుచుండఁ బ్రయాణము సాగించిరి. యానాధిరూఢులై కొందఱు పోయిరి. మందమందగమనముల విలాసధామమును బ్రవేశించి విడిదియింట వారినెల్ల నిలిపి వారిబంధుమిత్రాదులకుఁ దగినగృహములం జూపి యాయాయధికారు లవ్వారికిం దగుసపర్యలు సలుపఁ గట్టుదిట్టములుచేసి శ్రీనివాసదాసు స్వగృహమునకుం బోయెను.

ఆరాత్రి యెల్లరకు క్షణకాల మట్లు తోఁచి గడచెను. ప్రతిగృహము వివాహమంటపముగనే తోఁపఁజేయుచుండెను.

తెల్లవాఱుజామునవే మేల్కాంచి తమతమ విధుల నిర్వర్తించి కొని వాద్యధ్వనులఁ జెవియొగ్గి యాలించుచు జనులా పెండ్లి వేడుకలఁ జూడఁ గోరుచుండిరి. కన్యాదాతలు నభ్యంగస్నాన మొనరించి విధులందీర్చి లగ్నమునకై వేచియుండిరి. వరునిజన కులు కృతాభ్యంగస్నానులై కులాచారముల నయ్యైవేళం గుల నిర్వర్తించి ముహూర్తమునకై కనిపెట్టియుండిరి. ఇందిరా దేవియు శ్రీనివాసదాసును రామదాసయోగివర్యుం బురస్క రించుకొని సువాసినీబృందము తోడ నడువ విప్రప్రవరులు వేదపారాయణము చేయుచు రాఁగా శుభవాద్యధ్వనులు దిక్కులఁ బ్రతిధ్వనులీయఁ జేరవచ్చి వరునిఁ గులోచితమర్యా దలం దాఁటక పూజించి వరజననీజనకులఁ బ్రార్థించి శీఘ్రంబ యరుదెంచి సుముహూర్తమున నావాంఛఁ దీర్పవలయునని పలుక నమృతపుసోనల మించిన యా నిద్దంపుఁబలుకుల నాలకించి యింతింత యనరాని సంతసంబున శ్రీవత్సాంకదాసు భార్యా పుత్త్రపరివృతుండై సపరివారముగాఁ గదలి చని నిజపురోహి తోక్తమార్గంబు ననుసరించి కూరుచుండెను.

### పాణిగ్రహణమహోత్సవము.

శుభముహూర్తము సమీపించెనని పురోహితుఁడు వక్కాణించెను. శుభనినాదములు చెలరేఁగెను. కన్యావరుల యంతరమున నొకనూతనాంబరమును బట్టుకొని నిలుచుండిరి. రాధిక యంతకుమున్దే సకలాభరణభూషితయై మహా లక్ష్మిం బూజించుచుండెను. కావునఁ బురోహితుఁడు తల్లిదం డ్రులఁ జని స్వస్తివాచనపూర్వకంబుగాఁ బిలుచుకొనివచ్చి పశ్చిమాభిముఖము గలుగున ట్లుచితపీఠమునఁ గూరుచుండఁ

జేసిరి. మంగళప్రదము లగుగాథలు గలమంత్రములను శ్లోకములను బఠించిరి. బ్రాహ్మణప్రవరు లాశీర్వదించిరి. కన్యాదానము యథావిధిగ సాగెను. ఆయవనిక తొలఁగింపఁబడియె. వరుఁడు కన్యాముఖమును జక్కఁగాఁ జూచెను. అదియే ప్రథమ వీక్షణము. కావున నాతని మదింగల ప్రీతి యొకతేజోరూపమున నాకన్యకాహృదయమును దృష్టిమార్గమునఁ బ్రవేశించెను. కన్యామణిప్రమదము నట్లే వరునిహృదయమును వీక్షణమార్గమునఁ బ్రవేశించెను. ఆప్రీతి శాశ్వతమగుఁగాక యని పెద్ద లాశీర్వదించిరి. జీలకఱ్ఱయు బెల్లము కలిపి ముద్దఁజేసి వరుఁడు కన్యామూర్ధమధ్యమున నునిచెను. అదియే లగ్నమనఁబడును. తలఁబ్రాలుగ మనోజ్ఞ తమమౌక్తికములఁ జేకొని రాధిక మనోహరుఁడగు శ్రీకృష్ణదాసుమూర్ధమునఁ బోసెను. ఆతఁడట్లే దోసిటం గైకొని వానిని రాధికామస్తకమునఁ బోసెను. మంగళసూత్రధారణాదులు క్రమము తప్పక సాగింపఁబడెను. తలఁబ్రాలు పోసినపిదప మహాత్ముల యాశీర్వచనార్థము వధూవరుల వరుసఁగాఁ గూరుచుండఁ బెట్టిరి. నిర్మలాంతఃకరణులగు భూసురపుంగవులు లోనగువారు దంపతుల కీయిరువురకును శ్రీలలనాప్రాణనాథుఁడు సర్వమంగళాప్రాణేశుఁడు సరస్వతీమనోహరుఁడు శచీనాయకుఁడు తక్కుంగల దేవతోత్తములు నిరంతరసుఖానుభవదీర్ఘాయుర్భాగ్యముల నొసంగుచు రక్షింతురు గాక యని ద్రవ్యాభిలాషమునఁ గాక ప్రీతిమై నాశీర్వదించిరి.

ఆతరుణమున నామహాసభ భూసురేంద్రాదినిబిడమై యుండెను. రామదాసయోగీంద్రుఁడు లేచి నిలువంబడియెను.

వారి యమృతవాక్కుల వినఁ గుతూహలులై యుండువారు గాన నెల్లరు నిశ్శబ్దముగ నుండిరి. రామదాసిట్లు లుపన్యసించెను. నిర్మలాంతఃకరణభూషితులారా! పరోపకారపారీణులారా! ఈమహోత్సవమును గుఱించి నాలుగుమాటలు చెప్పెదను చిత్తగింపుఁడు. కన్యాదానముచేయుపద్ధతి యిది మీరు చూచితిరి గదా. సనాతనమగునది యీయాచారమే కన్యకను వివాహమునకన్న ముందు వరుఁడు కనుఁగొనరాదు. ఆతని తల్లిదండ్రులే యామె కులశీలాదులఁ బరికింపవలయు. లోకమున భగవంతుఁడు తప్పఁ దక్కినవారిలోఁ దలిదండ్రులకంటె దనయునిమేలుకోరువారు లేరనుట నిర్వివాదాంశము. అట్టి తలిదండ్రులు పరికించి కులోద్ధారకురాలు కాఁగలదని విశ్వసింపవలయు. ఆకన్యకను వరుఁడు వరింపవలయు. పాణిగ్రహణమున నొకవస్త్రము వరునకుం గన్యకకునడుమఁ బట్టుకొనఁబడును. ఆవలఁ గన్యక తనకుఁ దగిన ట్లునుపఁబడిన పీఠమునఁ గూరుచుండవలయు. పాణిగ్రహణము ననంతరము వస్త్రము తొలఁగింపఁబడును. అత్తరుణమునఁ దనయావజ్జీవసుఖాకర యగుకన్యకను వరుఁడు చక్కఁగాఁ జూడవలయును. ఆవీక్షణమే పరస్పరప్రీతిరశ్ముల వారిని బంధించును. ఈసంబంధ మాజన్మము నిలుచునదియే కాని నడుమ విడిపోవునది కాదనుభావమే వారికిం గల్గును. అట్టిప్రీతి శాశ్వతముగా నిలువక తప్పదు. ఒక్కరాజు పట్టాభిషిక్తుఁడు కాఁగా నాతనిపై మిగులఁ బ్రీతి యంతకుముందు లేకయున్న నిఁక నీతఁడే మనకు ఱేఁడు. మన మీతనిరక్షణమున నుండక తప్పదు. అనుభావము దృఢపడఁగా ముందున్న యసూయ

తో లఁగును. వానినే విశ్వసించి మానవు లుందురు. ఈయుదా హరణము మీయనుభవమునఁ దోఁచునదే కాని క్రొత్తగాఁ గల్పింపఁబడినది కాదు కదా. అట్లే తనయావజ్జీవము సహధర్మ చారిణి యని ప్రేమించినకన్యను వరుఁడు రూపమునే ప్రధాన ముగా భావించిన ననర్థము వాటిల్లును. గుణము ప్రధానముగా భావింపవలయుననియే సనాతనాచారము తెల్పెడిని. అట్లుగాక వివాహమునకంటె ముందే సహచరసల్లాపాదులచే నాకన్యకనుబరి చితంజేసికొని ప్రేమించి పిదప వివాహముచేసికొనిన నాప్రేమ మస్థిరమగుటయే కాక యనర్థదాయక మగుటకు సంశయంబే లేదు. ఒక్కనినే ప్రేమింపవలయునన్ననియమ మపు డుండదు. పెక్కం డ్రఁ బ్రేమించి యందెవ్వనిపై నతిశయవాంఛ కలుగునో యాతనిం గన్యక పెండ్లియాడునేని యద్దానిమనస్సు త్వరగా మాఱిపోవు ననుట యచ్చెరువును గల్పింపఁజాలదు. కావున వధూవరు లిరు వురును సద్గుణాలుబ్ధులు కావలయును. రూపపరీక్ష తల్లిదండ్రు లది ఈయాచారము ననుసరించినవివాహము వధూవరులకు సదా సంతోషదాయకంబే యగు. పరస్పరసహకారమును వారు విడువఁజాలరు.

ఈసనాతనాచారము హేయమని యూహించి యిష్ట మునకు ననువగుకన్యను బెండ్లియాడవలయునని యీకాలపు వారు విరళముగ నందం దుపన్యసించుచున్నారు కదా. ఒక్క నినే ప్రేమించుట యీనూతనాచారమున సంభవింపదు. ఎందఱినో పరీక్షించి యం దుత్తము నొక్కనిఁ బెండ్లియాడవలసి యుండును. అట్టిస్త్రీచిత్తము పలుతావులఁ బ్రసరించినదగుటం

జేసి యొక్కతావుననే నిలుచుననుట విశ్వసింపఁ దగనిమాట. వరునిచిత్తము నశ్లే యని నిశ్చయింపవలసి యుండును.

ఇటీవలఁ గొందఱు కాంతలు పెండ్లియాడినపిదప నాతని వదలి వేఱొకనింగూడి చరించుచు నితరులకుఁ దమమార్గము నుపదేశించుచు సభలకు విలజ్జం బోవుచుఁ బురుషులని యనుమానింపక మాటలాడుచుఁ గరము వైదుష్యము నగపఱచుచు వారి నవ్వించుచుఁ బ్రాచీనాచారములం దూలనాడుచుఁ బ్రవర్తించుచున్నవారని వినవచ్చెడిని. అది కరము చింతాకరము! పరిశుద్ధాంతరంగులకు మిగుల సంతాపకరము. పరపురుషునిం గూడితిరుగుట యెంతి మంచిదో నేఁ జెప్పనక్కఱ లేదు.* వయసుకత్తియ వయసుకానిం గూడి తిరుగుట భారత భూమి నీవఱకు లేదనియు, నిపుడు క్రొత్తగావచ్చినయాచారమనియు, మీరు నెఱుంగుదురు. చంద్రమతి, దమయంతి, సీతాది సాధ్వీమణులు జన్మించిన యీపవిత్రభూమియం దీయాచారము ప్రాంతది కాదని నేఁ జెప్పనేల? శాపానుగ్రహాసామర్థ్యము వెలయ నీభూమిని బొడమిన స్త్రీపురుషులు ప్రసిద్ధిగాంచిరి. మనశ్శుద్ధివినాశనం బగు నీయాచారము నవీనముగాఁ బొడ చూపుచున్నది. ఆమార్గము స్వేచ్ఛాప్రవర్తకుల కత్యంతాను

*"ఒక్కనిఁ బెండ్లియాడి మఱియొక్కని సుందరకాయుఁ గూడి యే
దిక్కునఁజూడఁ దానయయి తేటపడం దగుమాటలాడుచుక్
మిక్కిలి నేర్పుకత్తెయన మించి చరించుచునున్నఁ జూచి పెక్
మక్కువనాదరింతు రిది మంచిది గా దన రేమికాలమో."

కలివిలాసము.

కూలముగా నుండుటంబట్టి కాఁబోలు కొంద ఱీయాచారమే
మంచిదనుచున్నారనియు, దానినే యనుసరింపఁ బ్రయత్నించు
చున్నవారనియు వినుచున్నాఁడను. ఈయాచారమే క్రమ
క్రమముగ వృద్ధియైనచోఁ బ్రాచీనసదాచారము లడుగంటి
స్వేచ్ఛాచారములు ప్రబలును. దాన సత్యము ధర్మము నశిం
చును. అసత్యాధర్మములు పెంపొందును. వివాహధర్మము
తుదముట్టం జెడును. సహధర్మచారిణి యనుపేరు భార్యకుం
జెల్లదు. దాంపత్యసుఖము కూడఁ జెడఁగలదు. పరపురుష
సంగతిన్ మెలంగుట యుత్తమస్త్రీధర్మంబు గాదను స్మృతి
పురాణేతిహాసములు వ్యర్థములగు. ఏనాఁ డాభావము మాన
వులమదుల వ్యాపించునో యానాఁడే కలిపురుషుఁడు తాండవ
మాడునని నమ్మవలయును.

మహాజనులారా! *సత్కర్మముల నున్మూలించిన భగ
వంతుఁడు దూరమగును. కులకాంతలు దుష్టలగుదురు. దాన
వర్ణసంకరము గలుగు. అయ్యది నరకప్రాప్తి హేతువగును.
పితరులు లుప్తపిండోదకక్రియు లగుదురు. విశేషించి స్త్రీలు

---

*అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః, స్త్రీషు దుష్టాసు
వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య
చ, పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. భగవద్గీత ౧ అధ్యా.
యాదృశం భజతే హి స్త్రీ సుతం సూతే తథావిధం, తస్మాత్ప్రజావిశుద్ధ్యర్థం
స్త్రియం రక్షేత్ప్రయత్నతః. స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మాన మే
వచ, స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి. మనుస్మృతి
౯ అధ్యాయము.

ప్రపంచవృద్ధిహేతుభూతలు. కావున స్త్రీలమనస్సులు దుష్టములు కాకయుండఁ గాపాడవలయును. కులమును, జరిత్రమును, ధనను, సంతానమును, ధర్మమును గాపాడుకొనఁ దలఁచువాఁడు పరపురుషసంగతిఁ బోనీకయుండ భార్యను రక్షింపవలయును. లేనిచో నివి యన్నియు దుష్టములవు. కావుననే పెద్దలు యోగదృష్టిం బరికించి ధర్మములను యుగముల కనుకూలములుగా మార్చిరి. భగవంతునియందు భక్తి గలుగుమార్గముల సులభముగాఁ దెలిపిరి. వానినెల్ల నీనూతనాచారములు పాడుచేయును.

ఈవివాహము ప్రాచీన సదాచారము ననుసరించి చేయఁబడినది. వధూవరు లన్యోన్యప్రీతి గలిగి మీ యమోఘాశిషములమూలమునఁ బరమేశ్వరకరుణకుం బాత్రులై దీర్ఘాయురారోగ్యములఁ గాంతురు గాక. సర్వేశ్వరుననుగ్రహమున సనాతనధర్మము, తదనుగుణము లగునాచారములు సశింపక యథాపూర్వముగా నుండుఁగాక. మీరందఱు మన్వాదిస్మృతులయుఁ బురాణములయు, మహాభారతాదీతిహాసములయు ధర్మములను వదలక యాచరించుచు, దురాత్ములయుపదేశముల, నుపన్యాసముల నాలకించి మోసపోవక వారు స్వేచ్ఛాప్రవర్తకులని లోకమున గౌరవమునే కోరువారని, శాస్త్రములతత్త్వముల నెఱుంగనివారని కేవల శుష్కవాదులని, ఆస్తికులభంగిఁ దోఁచు నాస్తికులని నిశ్చయించి వారికి దూరముగాఁ దొలంగియుండవలయును. వారితో విశేషించి సంభాషింపరాదు. వారియుక్తుల విని యిందేమేని మేలుండునా యని యాలోచింపరాదు. వారింజేరి భాషింపఁ బూన

రాదు. వారికిని దైవము తోడ్పడునని మనమించుకేఁ దలంప రాదు. వారికి భగవద్గీత లుపన్యాసముల నుపయోగించుననియే నిశ్చయింపవలయును. ఈ నాలుగుమాటలు మీకుఁ దెలుపు టనవసరమే యైనను వచ్చియున్నాఁడఁ గానఁ జెప్పితిని మను జులసంసర్గమునే మాని యందందు నిర్జనస్థలముల నివసించుచు భగవన్నామసంకీర్తనము చేయుచునుండిన నేనీకాలమునఁ బ్రబలిన దురూహాలననుసరించి ప్రాచీనసదాచారముల మానుదు రేమో యన్నసందియమున వచ్చి లోకమున నుదాహరణ భూతులగు నీసజ్జనుల ప్రయత్నమునకుఁ దోడ్పడ నరుదెంచి తిని. ప్రాజ్ఞులారా! మీ రెఱుంగని విషయములు లేవు. మీరు చదువనిశాస్త్రములు లేవు. మీ రాచరింపనిధర్మములు లేవు. మీ రభ్యసింపనియోగములు లేవు. మీకుఁ దోఁపని యూహాలు లేవు. ఐనను వాక్చాపలమున నామనస్సునఁ గల యభిప్రాయమును దాఁపక వెలిపుచ్చితిని. మీ రెల్లరు సమా హితచిత్తులరై యాలకించితిరి. ఇఁక నేను మీయనుజ్ఞఁ గైకొనఁ దలఁచుచున్నాఁడను. తరణోపాయము దొరకక భగ వంతు నాశ్రయించినఁ దనంతన తానే దొరకునని నమ్మియున్నాఁ డను.

అని యుపన్యసించి రామదాసు కూరుచుండెను. ఆమహో పన్యాసము నాలకించి గంభీరమగు తదర్థమును గ్రహించి సామా న్యులుకూడఁ బరమానందభరితులైరన నిఁకఁ బండితులమాట నిటఁ జెప్పనేటికి? వారు కూరుచుండఁగనే మీయభిప్రాయము సత్యధర్మవిహితము. అని యేకవాక్యముగఁ దమ మనోభావ ములఁ దెల్పిరి మఱియు నెవ్వరెవ్వరు సనాతనసదాచారనిర్మూల

నము చేయఁ బ్రయత్నింతురో వారిని దమజాతినుండి వెడల నడువఁ దీర్మానము గావించిరి. వివాహాదులయందుఁ గలకట్టు బాటుల సడలింపరాదనియు వానివలనిలాభములు వాఙ్మానస గోచరములు సామాన్యులకుఁ గావనియుఁ దప్పక యెంతోమేలు వానివలనఁ గలదనియు నతీంద్రియజ్ఞు లాశుభముల నెఱింగియే వాని నియమించిరనియు నట్టివాని నల్పజ్ఞులు సడలింపఁ బ్రయత్నించిన వారిభావముల మన మంగీకరింపరాదనియు నెల్లరు తీర్మానించిరి.

ఆపిదప సాగవలసిన వివాహతంత్రములు సాగింపఁ బడి యెను. సకాలమున ముహూర్తము జరుపఁబడుటయుఁ బెద్ద లాశీర్వదించుటయుఁ జూచువారల కెంతో యామోదమును గలిగింపఁజాలెను. శ్రీనివాసదాసు వచ్చిన పెద్దల బహూకరించి చందనతాంబూలముల నొసంగి రామదాసుగారిని గృహప్రవే శము దనుకనుండి పోవలయునని ప్రార్థించి వారందుల కను మతింప నెల్లరను భోజనములు సేయ నాయాయి చోటులకు దయ చేయుఁడని ప్రార్థించెను. ఎల్లరు తమతమ విడుదులకుం బోయిరి. వధూవరుల కాపగలు భోజనము లేకుండుట యాచారము. అరుంధతీదర్శనానంతరము భుజింపవలయునని పెద్దలయాశ యము. ఆ యాచారము ననుసరించి వారు ఫలాహారములఁ గైకొనియుండిరి.

వచ్చినవారెల్ల భుజించి సంతృప్తి మిగులంగాంచి యిం చుక విశ్రమించి సాయంసమయమునకు ముందే కార్యక్రమము నెఱింగినవారు గానఁ బెండ్లిపందిరి కరుదెంచిరి అందాసమయ మున నాట్యము సాగెను. వారకాంతలు వచ్చి యెల్లరకు నమ

స్కరించి వారియనుమతినొంది యభినయమున కారంభించుచు,

శ్లో. *"దేవః పాయాత్పయసివిమలే యామునే మజ్జతీనాం
యాచంతీనామనునయపదై రంచితాన్యంశుకాని,
లజ్జాలోలై రలసవిలసై రున్మిషత్పంచబాణై
ర్గోపస్త్రీణాం నయనకుసుమైరర్చితః కేశవోనః."

అను శ్రీకృష్ణకర్ణామృతశ్లోకమును బఠించెను. దానిని వినినంతన సభ్యులు సంసారముల మఱచి శ్రీకృష్ణధ్యానతత్పరులైరి అంత నాకాంతావతంసము తదర్థమును జెప్పకుండ నేత్రములను హస్తములను గదలించుచు విధినతిక్రమింపక దానంగలభావమెల్లం గనంబఱచెను. "నయనకుసుమైః" అనుపదము నభినయించునపుడు సభ్యులయాశ్చర్యము వర్ణనాతీతమయి యుండెను. అభినయానంతర మాయిందుముఖి భక్తిభావము నెల్లరుం గొనియాడిరి. ఆరేయి భుక్త్యనంతరము హరికథ సాగెను రుక్మిణీకల్యాణకథను దెలుపుచు నాదాసునెల్లర విస్మితచిత్తులనుగా నొనరించెను. ఈరీతిగా నాయాయి వినోదముల నైదుదినములు సుఖముగా గడచెను.

విద్వత్కవిప్రభృతుల నుచితరీతి సమ్మానించి శ్రీనివాసదాసు పాత్రాపాత్రవివేకముగలవాఁ డనుఖ్యాతికిం బాత్రుఁ డయ్యెను. తదనంతరము జాలంధరపురమునకు గృహప్రవేశ

* "యమునావేణికయందు గోపికలు నీరాడఁగ స్వకీయాంశుకౌ
ఘములన్ దాఁచఁగ సిగ్గుచే మృదులవాక్యప్రౌఢితో వేడుకన్,
సముదంచన్మదనాలసోల్లసనిరీక్షానీలనీరేజమా
ల్యములన్ వారలు పూజచేయఁదగునయ్యబ్జాక్షు సేవించెదన్."

మను కార్యమున కెల్లరు దయచేయవలయునని శ్రీవత్సాంక దాసు ప్రార్థింప బంధుహిత పండితాదు లెల్లరు నచ్చటికిఁ బయనము సాగించిరి వచ్చునపు డెట్టియుపచారముల పూర్వమున శ్రీనివాసదా సేర్పఱచి యుండెనో యట్టి యుపచారములు చేయ శ్రీవత్సాంకదాసు మఱుపయనమున నేర్పాటుచేసెను. వీసమంతయు నావిషయమున భేదము గానరాక యుండెను. కతిపయ ప్రయాణముల జాలంధరపురమును బ్రవేశించి శుభ ముహూర్తమున గృహప్రవేశ శుభకార్యమును జరపించిరి. మూఁడుదినము లందెల్లవారు నుండిరి. ఎల్లర నాదాసు నుచిత విధుల బహూకరించెను. ఎల్లరుఁ బరమసంతుష్టమానసులై తమతమ గ్రామములకు వారి కీర్తియశస్సులం బొగడుచుఁ బోయిరి. అల్లునిం గూఁతును బిలుచుకొని శ్రీనివాసదాసు విలాసధామమున కరుదెంచెను. కొన్ని దినములుండి శ్రీకృష్ణ దాసు ధర్మపత్నిం దోడుకొని తండ్రియానతిమెయి నిజ పురమున కరిగెను. ఈ రెండువంశము లాదంపతులపై నాధార పడి యున్నందునఁ గొంతకాలము జాలంధరపురమునను గొంతకాలము విలాసధామమునను వా రుభయులు నివసించుచుఁ దల్లిదండ్రులకు నత్తమామలకు మహోత్సవ మును గలిగించుచు రాధికా శ్రీకృష్ణదాసులు పరోపకార తత్పరులై న్యాయార్జితవిత్తులై సుజనరంజనులై శాంత భూషణులై యన్యోన్యానురాగము వర్ధిల్ల వర్తిల్లుచుండిరి. రాధిక యక్కాలపుఁ బురంధ్రీమణుల కుదాహరణభూతయై విద్యావినయముల విఖ్యాతింగాంచి సహధర్మచారిణి యను పేరు సార్థకమగునట్లు ప్రవర్తించుచుండెను. శ్రీకృష్ణదాసు

రాధికయనుమతింగాని చేయందగు కార్యముల నొనరించుచుఁ బ్రసిద్ధిఁబొందెను. నాలుగుదేశములయందును వారి ప్రఖ్యాతి వ్యాపించెను. భగవంతునియందు భక్తి, జననీజనకులయందుఁ బ్రీతి, ఆశ్రితులయందు వాత్సల్యము గలిగి రాధికయు శ్రీకృష్ణదాసును సుఖసంపదల ననుభవించుచుండిరి.

శ్రీరాధామాధవార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1939.